# విమానవీరుడు

(నవల)

రచన:

మట్టెగుంట రాధాకృష్ణ



కవితా పబ్లికేషన్స్

విజయవాడ-2.

# విమాన వీరుడు

ఆ క్రొత్త పిల్లవాణ్ణి గురించి ప్రత్యేకంగా చెప్పతగిన విశేషమంటూ ఏమీలేదు. మిగతా అందరు పిల్లల వలెనే వాడుకూడా ఒక పిల్లవాడు. ఇంకా వివరంగా చెప్పాలంటే, ఆ కొత్త పిల్లవాడు ఓ సామాన్య కుటుంబానికి చెందినవాడు. ఇక పోతే, వాడి రూపసంపద కూడా ఏమంత విశేషమయినది కాదు. అయితే, గుబురుగా పెరిగి ముందుకి విరిగిపడుతున్న నల్లని నొక్కులజుట్టు చాటున మెరిసిపోయే విశాలమయిన ఫాలభాగం; సూటిగా, సునితంగా నదురు బెదురు లేకుండా చూసే చక్రాలవంటి గుండ్రని కళ్లు—ఆ క్రొత్త పిల్లవాడి కొక ప్రత్యేకతను, ఆకర్షణను చేకూర్చాయి.

హైస్కూలు హాస్టలయిన "వినయ విహార్" నుంచి మిగతా పిల్లలతో కలిసి ఆ క్రొత్త పిల్లవాడు కూడా బడికి వచ్చాడు. కాని, వాడి దుస్తుల తీరు, ధరించిన విధానం మిగతా పిల్లలకంటె ప్రత్యేకంగా ఉంది. వాడు ఖాకీరంగు పొడుగు చొక్కా, అదే రంగు పొడుగులాగు తొడుక్కున్నాడు. మెడ చుట్టూ ఎర్రని రుమాలు వంటిది ముచ్చటగా చుట్టుకున్నాడు. బుజానికి భారత వైమానిక దళచిహ్నం సగర్వంగా పెట్టుకున్నాడు.

"హాయ్, హాయ్, మన తరగతికి విమానాలను నడిపే వీరుడు వచ్చాడోయ్. ఒరే అబ్బాయిలూ, అందరు అటుకేసి చూడండి. "పిప్పళ్ల బస్తాలా లావుగా, పొట్టిగా ఉన్న భీమ

శంకరం ఓసారి పెద్దగా అరిచాడు. ఇక్కడ భీమశంకరాన్ని గురించి ఒకింత వివరించడం అవసరం. నామకరణంమహోత్సవం నాడే వాడి ఆకారాన్ని ఊహించో, లేక మరే ఇతర కారణం వల్లనో, వాడి తల్లి దండ్రులు వాడికి భీమశంకరం అని పేరు పెట్టినా తరగతిలోని పిల్లలందరు వాణ్ణి "కుంభకర్ణుడు" అని ముద్దుగా పిలుస్తారు. అందుకు కారణం ఏమంటే వాడు బడికి వచ్చినదగ్గర నుంచి ఇంటికి వెళ్ళే వరకు చిన్నగా గురక పెడుతూ, మధ్య మధ్య సున్నితంగా కలవరిస్తూ బల్ల మీద పడుకుని చల్లగా కునుకు తీసేవాడు. అయితే 'కుంభకర్ణుడు' అనే భీమశంకరం వద్ద ఓ సుగుణం కూడా ఉంది. ఇంటికి వెళ్ళిన తర్వాత శ్రద్ధగా చదివేవాడేమో ప్రతి సంవత్సరం దండయాత్రలు లేకుండా పరీక్షల్లో కృతార్థుడవుతుండేవాడు.

భీమశంకరం అరుపు విని పిల్లలందరు ఓ సారి తలయెత్తి ఆ క్రొత్త పిల్లవాడి కేసి ఆసక్తిగా చూశారు. తరువాత మెల్లగా తమలో తాము ఏదో గొణగడం ప్రారంభించారు.

"అరే రెండు బుజాలమీద విమానాలు నడిపే వాళ్ళు పెట్టుకునే గుర్తులు కూడా ఉన్నాయే! నేను ఇంతవరకు వాటిని చూడనే లేదు." భీమశంకరం ఆశ్చర్యంగా అన్నాడు.

ఆ క్రొత్త పిల్లవాడు తిన్నగా భీమశంకరం దగ్గిరికి వెళ్లి వాడి ముఖంలోకి సూటిగా చూస్తూ తీవ్రంగా అన్నాడు. "తమరు కాస్సేపు నోరు మూసుకుంటే మంచిది. తరువాత ఏమనుకున్నా ఏం లాభం లేదు." పిమ్మట వాడు వెనక బల్ల మీదకి వెళ్ళి రాఘాయి ప్రక్కనే కూచున్నాడు.

భీమశంకరం ఆ క్రొత్త పిల్లవాడి ధోరణి ఏమీ అర్థం కాలేదన్నట్లు ఓ సారి అందరి కేసి చూసి, వెక్కిరింపుగా బుజాలు ఎగరేసి నెమ్మదిగా వెళ్లి తన బల్లమీద కూచున్నాడు.

ఆ క్రొత్త పిల్లవాడు తన ప్రక్కనే కూచోవడం రాధాయికి ఒక విధంగా గర్వకారణమయింది. వాడుమిగతా పిల్లలందరి కేసి సగర్వంగా చూశాడు.

ఇంతలో గంట మ్రోగింది. పిల్లలందరు గబగబా వెళ్ళి ఎవరి స్థానాల్లో వాళ్ళు కూర్చున్నారు. కాని, వాళ్ళ అందరి ధ్యాస వెనుక బల్లమీద కూచున్న ఆ క్రొత్త పిల్ల వాడి మీదే ఉన్నది. వాడు ఏ ఊరు నుంచి వచ్చాడో, ఇంతకు పూర్వం ఏ బడిలో చదువు కున్నాడో, వాడి పేరు ఏమిటో, వాళ్ళ నాన్న ఏం పని చేస్తున్నాడో, మొదలగు విషయాలు తెలుసుకోవాలనే కుతూహలంవాళ్ళలో ఉరకలు వేయసాగింది. కాని, ఆ కొత్త పిల్లవాడికి తమ పూర్వ పరి చయం లేనందున, తమంత తాము వెళ్ళి వాడి వివరాలను అడగటం అంత బావుండదనే భావంతో వాళ్ళు తమ కుతూ హలాన్ని తాత్కాలికంగా అణచుకున్నారు. ఆ కొత్త పిల్ల వాడి మనోభావాలు కూడా ఇంచుమించు అదే విధంగా ఉన్నాయి, తను చేరిన తరగతిలోని పిల్లలు అసామాన్యులు, అందుకు తోడు అమిత యుక్తిపరులు అని వాడు అను కున్నాడు.

పచ్చగళ్ళ పొడుగుచొక్కా, ఎర్ర చారల పొడుగు లాగు తొడుక్కున్న ఓ అబ్బాయి చేతిలోని సన్నని బెల్టును ఝుళిపిస్తూ గుర్రం ఎక్కి వస్తున్న వాడికి మళ్లే గంతులు

వేస్తూ సుడిగాలిలా, జడివానలా తరగతిలోకి ప్రవేశించాడు. తను నిజంగా గుర్రం ఎక్కి వచ్చినందున చాలా అలసిపోయి నట్లు అందరి ముందు ఓ నిముషంసేపు నటించాడు.

"మాష్టారు వస్తున్నారు. జాగ్రత్త. ఎక్కడి దొంగలు అక్కడే గప్ చిప్ ... వాడు బిగ్గరగా అన్నాడు.

రాజారావు మాస్టారు మెల్లగా తరగతిలోకి ప్రవేశించారు. మాస్టారుకి ముప్ఫయి ఏళ్ళ వయసు ఉంటుంది. ఆజానుబాహు విగ్రహం, ప్రశాంతమయిన ముఖం. ప్రేమ, కరుణ; వాత్సల్యాలను వెదజల్లే విశాల నేత్రాలు. ఎల్లవేళల చల్లని చిరునవ్వులను వర్షించడం, హుషారుగా ప్రవర్తించడం ఆయన ప్రత్యేకత. అందు వల్లనే పిల్లలందరు ఆయనంటే అంతగౌరవం, ఆదరం చూపుతారు. ఆయనమాటలను ఆజ్ఞలుగా స్వీకరించి శిరసావహిస్తారు.

మాస్టారు రాగానే పిల్లలందరు గౌరవ పురస్సరంగా లేచి నిలబడ్డారు.

"అందరు కూర్చోండి." రాజారావు మాస్టారు చిరునవ్వుతో పిల్లలందరి కేసి ఆప్యాయంగా చూస్తూ అన్నారు.

ఆ కొత్త పిల్లవాడు మాస్టారి ధోరణి చూసి ఎంతగానో ఆశ్చర్యపోయాడు. అంతవరకు వాడు అటువంటి మాస్టారిని చూచివుండలేదు.

"మాస్టారూ. మాస్టారూ, మనతరగతికి ఇవాళ ఓ కొత్తఅబ్బాయి వచ్చాడండీ...ముందుబల్ల మీాద కూచున్న ఓ పిల్లవాడు ఆత్రంగా అన్నాడు.

"ఆ సంగతి నాకు తెలుసు," అంటూ రాజారావు మాస్టారు హాజరు పట్టీ వేయడం ప్రారంభించారు.

"విజయసారథి. కూన పులి విజయసారథి. . ." "రాజారావు మాస్టారు 'పిలిచారు.'

"ప్రజంట్ సార్. . ." వెనుక బల్లమీద కూచున్న ఆ కొత్తపిల్లవాడు ఠీవిగా అన్నాడు.

"కూన పులి? !"

ఆ ఇంటిపేరు వినగానే పిల్లలందరు ఆశ్చర్యపోయారు. ఉత్సాహంగా విజయసారథి కేసి చూశారు.

"మొత్తానికి మంచి ఇంటిపేరు సంపాయించావు!" రాజారావు మాస్టారు అన్నాడు. "మరి కేప్టెన్ కూనపులి వివేకానందమూర్తిగారు నీకు తెలుసా ?"

"తెలుసండి".

"ఆయన నీకేమైనా బంధువా ?"

"మా అన్నయ్యేనండి." విజయసారథి తల వంచుకొని మెల్లగా జవాబు ఇచ్చాడు.

"ఏమిటి? కెప్టెన్ వివేకానందమూర్తిగారు నీకు అన్నయ్యా అవుతాడా ? నిజంగా. . ."

"నిజంగా నేనండి."

"బావుంది. చాలా బావుంది. మీఅన్నయ్యను గురించి నిజంగా నీవు చాలా గర్వించవచ్చు. కాదు కాదు మేము కూడా ఆయన ఆంధ్రు డయినందుకు ఎంతగానో గర్విస్తున్నాం." రాజారావు మాస్టారు గంభీరంగా అన్నారు. "వైమానిక దళాధిపతిగా వివేకానంద మూర్తిగారు మాతృ

భూమికి చేసిన, ప్రస్తుతం చేస్తున్న సేవ అపూర్వమైన దన డానికి సందేహంలేదు. అద్వితీయమైన దనడంలో అతి శయోక్తిలేదు. ఒక్క యుద్ధరంగంలోనేగాక, శాంతికాలం లోకూడా ప్రకృతి వైపరీత్యాల వల్ల కష్టనష్టాలకు గురిఅయ్యే సోదర ప్రజలకు ఆయన చేసిన సేవ ప్రశంసనీయమైనది. ప్రస్తుతించ తగినది." ఓ క్షణంసేపు మౌనంగా ఉన్న తరువాత మాస్టారు అన్నారు; "ఊఁ, ఇక పాఠం మొదలు పెడదామా." అయితే ఒక్క విషయం. ఇకనుంచి మీ రందరు చాలా జాగ్ర త్తగా, శ్రద్ధగా చదవవలసివుంటుంది, తెలుసా? వివేకానంద మూర్తిగారు విమానం నడపటంలో ఎంత ప్రవీణులో, విజయ సారథి కూడా చదువులో అంత ప్రవీణుడయితే అతన్ని మీరు ఎన్నటికీ అందుకోలేరు. కనుక, మీరందరు పూర్వం వలె కాకుండా ఇకముందు అమిత శ్రద్ధాసక్తు లతో చదివి విజయ సారథితో సమానంగా మార్కులు సంపాయించుకోవలసి ఉంటుంది. నేను చెప్పేది అందరు శ్రద్ధగా విన్నారు కదూ?"

అందరు విన్నట్లు తలలుతిప్పారు.

"ఇదిగో భీమశంకరం, నువ్వు వెనుక బల్లదగ్గిర ఏంచే స్తున్నావు? నీ మామూలు స్థలం ఎక్కడ?" రాజారావు మాస్టారు వెనుకబల్ల దగ్గిర తారట్లాడుతున్న భీమశంకరాన్ని ప్రశ్నించారు.

భీమశంకరం ఏమీ మాట్లాడలేదు. తిన్నగా వెనుక బల్లమీదికి వెళ్ళి కూచుని, తీరిగ్గా విజయ సారథితో వాళ్ళ అన్నయ్యను గూర్చి బాతాఖానీ వేద్దామని వెళ్ళాడు. కాని,

మాస్టారు అది గమనించడంతో వాడి ఆశ నిరాశ అయింది.

"ఇక నుంచి నేను ఇక్కడే కూచుంటాను, మాస్టారూ. చివరికి ఎట్లాగైతేనేం అతి కష్టం మీద భీమశంకరం ఆ మాటలు అనకలిగాడు.

ఆ బల్లమీద ముగ్గురు ఎట్లా కూర్చుంటారో, నాకు అర్థం కాలేదు. ఇంతకీ. నువ్వు అక్కడ కూర్చోడానికి కారణం ఏమిటి?"

"ఏమీలేదండి...మరేమో ... ఏమీ ... అకఁ... ఏమీలేదండి. నేను ఎన్నాళ్ళనుంచో వెనుక బల్లమీద కూచోవా లనుకుంటున్నానండి. మరేమో, ఈ బల్లమీద ముగ్గురు కూచో వచ్చాండి..."

"ఇంకానయం, నలుగురు కూచో వచ్చనలేదు. ఇదిగో భీమశంకరం...నిన్నే...వెంటనే వెళ్ళి నీ మామూలు స్థలంలో కూచో. ఊఁ త్వరగా..."

భీమశంకరం ఇష్టం లేనట్లు ముఖం పెట్టి, నీరసంగా కాళ్ళీడ్చుకుంటూ అక్కడినుంచి బయల్దేరాడు.

"ప్చ్, పాపం, కుంభకర్ణుడికి నిద్రపోయే ప్రాప్తంలేదు." పచ్చగళ్ళ పొడుగు చొక్కా ఎర్ర చారల పొడుగులాగు తొడుక్కున్న పిల్లవాడు అన్నాడు.

"రాజూ, నీవ్యాఖ్యానాలు కాసేపు ఆపితే సంతోషిస్తాను." రాజారావు మాస్టారు కఠినంగా అన్నారు.

పిల్లలందరు ఎవరిస్థలాల్లో వారు నిశ్శబ్దంగా కూచున్నారు. అట్లా ఓ నిమిషం గడచిన తర్వాత భీమశంకరం నుంచి ఓ చిన్నఉత్తరం అంచెలవారీగా రాధాయికి అందింది.

రాధాయి, మాస్టారు చూడకుండా ఆ ఉత్తరాన్ని ఓ పుస్తకం మధ్యన పెట్టి మెల్లగా చదవసాగాడు.

"రాధాయి! మనం ఇద్దరం స్థలాలు మార్చుకుందామా? నువ్వు ఒక్కసారి కనుక నాస్థలంలో కూచున్నావంటే జన్మ జన్మాలకీ అక్కడేకూచోవాలనుకుంటావు. కారణం ఏమంటే, నీవు ఇప్పుడు కూచున్న పాతబల్లలా నాబల్ల ఏప్పటికి అటు ఇటు ఊగులాడదు. అంతేగాక, కూచోడానికి కూడా చాలా హాయిగా వుంటుంది. ఇక్కడ కూచుంటే మన ఆటస్థలం, అందులో ఎప్పుడూ ఆనందంగా ఆడుకునే పిల్లలు, అన్నిటిని మించి మనకి ఇష్టమయిన మిఠాయి కొట్టు చక్కగా కనిపిస్తుంది. మిఠాయి కొనుక్కోడానికి జేబులో డబ్బులు లేకపోయినా ఆకొట్టుకేసి చూస్తూ సంతృప్తి పడవచ్చు. ఇంతకీ నువ్వు ఇందుకు ఇష్టపడతావో, లేదో వెంటనే వ్రాస్తావుకదూ? నీ మిత్రుడు, భీమశంకరం."

కాని. రాధాయి ఆ ఉత్తరానికి ఏమీ జవాబు చెప్పలేదు. ఎంతసేపటికీ జవాబు రాకపోయే సరికి భీమశంకరం ఓసారి వెనక్కి తిరిగి రాధాయికేసి ఆత్రంగా చూశాడు. రాధాయి స్థలాలు మార్చుకుందామని కాని, వద్దనికాని చెప్పకుండా భీమశంకరాన్ని వెక్కిరించడం ప్రారంభించాడు.

"ఊఁ హుఁ, అంతవరకువచ్చిందీ నీవ్యవహారం! "భీమశంకరం మెల్లగా తనలో తాను గొణుక్కుంటూ రాధాయి కేసి కోపంగా చూశాడు. "సరేలే, తొందరపడకు. బడి వదిలిన తర్వాత కాని నీ అంతు తేల్చను."

ఇంతలో రాజారావు మాస్టారు భీమశంకరాన్ని నల్ల

బల్లమీదఉన్న భారతదేశ పటంకేసి చూసి తను అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పమని కోరారు. దాంతో భీమశంకరం పంచప్రాణాలు పైకెగిరిపోయాయి. వాడు వుసూరుమంటూ నీరసంగా లేచి నిలబడ్డాడు.

తరగతిలో ఇంత హడావుడి జరుగుతున్నా విజయ సారథి మట్టుకు ప్రశాంతంగా కిటికీలోంచి బయటికి చూస్తూ కూచున్నాడు. తమ గదికి కాస్త దూరంలోనే నిండుగా, నిర్మలంగా ప్రవహిస్తున్నది. నదికి అటు ఇటు ఎత్తుగా, ఏపుగా పెరిగిన మామిడిచెట్లు, నది అవతల వైపున విశాలంగా విస్తరించి ఉన్న పచ్చిక బయళ్ళు ఆ దృశ్యం వాణ్ణి అమితంగా ఆకర్షించింది. మంత్రముగ్ధుణ్ణిచేసింది. విజయసారథి అటు వైపే కన్నార్పకుండా చూడసాగాడు. ఓ వైపు పాఠం జరుగుతున్నా తరగతిలోని పిల్లలందరు విజయసారథి గురించే ఆలోచించ సాగారు. విజయ సారథి నిజంగా ఎంతో అదృష్టవంతుడు! లేకపోతే, కెప్టెన్ వివేకానందమూర్తి వంటి అన్నయ్యని పొందకలుగుతాడా? తరగతిలోని ప్రతి ఒక్క పిల్లవాడు అటువంటి ఆలోచనల్తో ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు.

"ఏరా శంకరం, రాత్రి ఇంటి దగ్గిర ఒక్కసారయినా పుస్తకం తెరిచావా అని! నిజంచెప్పు." రాజారావు మాస్టారు శంకరాన్ని ప్రశ్నించారు.

"రాత్రి తొమ్మిదికి ... అహాఁ, ... పది గంటల దాకా చదివానండి నిజంగా మాస్టారూ." భీమశంకరం దీనంగా అన్నాడు.

"అందుకే కామోసు పాఠం అంత బాగా వచ్చింది! ఇట్లా కనుక చదివావంటే నువ్వు అయిదవఫారం కనీసం అయిదేళ్ళు చదవ వలసి ఉంటుంది. తెలుసా?"

"తెలుసండి." భీమశంకరం దిగులుగా అన్నాడు.

"అది కాదు శంకరం, నువ్వు అయిదవఫారం చదువు తున్నావుకదా ఆంధ్ర దేశంలోని ముఖ్యమయిన నదుల పేర్లు అయినా తెలియవుగా?"

"శాద్దిగా తెలుసు మాస్టారూ"

"ఆ తెలుసిందేమిటో త్వరగా చెప్పు"

"భారత దేశంలో ... ఆహాఁ కాదు...ఆంధ్ర దేశంలో చాలా నదులు కలవు." భీమశంకరం మెల్లగా ప్రారంభించాడు. "అవి ప్రవహించును. మరియు సముద్రంలో కలియును..."

"ఊఁ, తర్వాత..." మాస్టారు నవ్వుతూ ప్రశ్నించారు.

"తర్వాత అవి సూర్యరశ్మికి ఆవిరియై, పైకి పోయి, తిరిగి వర్ష రూపమున క్రిందపడి, తిరిగి నదులుగా మారి ప్రవహించుచున్నవి. అవి మళ్ళీ సముద్రంలో..."

"సరి సరి. ఎంత చెప్పినా నదులు ప్రవహించడం, సముద్రంలో కలియడం — ఈ గొడవేనా లేక పోతే ఇంకా ఏమయినా చెపుతావా?" రాజారావు మాస్టారు ప్రశ్నించారు విసుగ్గా.

"ఆంధ్ర దేశంలోని నదులు చాలా లోతు అయినవి."

"అందుకు ఒప్పుకుంటాను కాని, ఇక నీ పిచ్చి మాటలు కాస్త చాలించు." మాస్టారు కోపంగా అన్నారు.

"ఈ నది పేరు ఏమిటో చెప్పు" మాస్టారు దేశ పటంలోని ఓ నీలి గీతని చూపిస్తూ అన్నారు.

భీమశంకరానికి ఆ నీలి గీత ఏ నదిని సూచిస్తుందో ఎంత ఆలోచించినా అంతు పట్టలేదు. వాడు దేశ పటం కేసి దీనంగా చూస్తూ నిలబడ్డాడు.

"విజయ సారథీ, ఆ నది పేరు నువ్వు చెప్పగలవా ?" మాస్టారు ప్రశ్నించారు.

"చెప్పగలనండి." విజయ సారథి ధైర్యంగా అన్నాడు. "అది కృష్ణానది."

"అవును నువ్వు చెప్పింది నిజం." మాస్టారు అన్నారు "ఇది మీ అన్నయ్య ప్రయాణంచేసే మార్గంలో తగులు తుంది కదూ ?"

విజయసారథి అవునన్నట్లు తల త్రిప్పాడు.

పిల్లలందరు ఓ సారి ఆ పటం కేసి కుతూహలంగా చూశారు. ఆ పటం పాతది కావటం వల్ల అక్కడక్కడ చిరిగిపోయింది. ఒక్కోచోట కాన్వాసు గుడ్డమీద నుంచి కాగితం ఊడిపోయి క్రిందికి వ్రేలాడుతూ – దేశ పటంలో మైదానాలని గుర్తింపబడిన చోట్ల పెద్ద కొండల్ని, పీఠ భూముల్ని సృష్టించింది. కాని, పిల్లలు మాత్రం ఇవేమీ పట్టించుకోకుండా శ్రద్ధగా ఆ పటం కేసి చూడసాగారు. అట్లా చూడడంద్వారా వాళ్లు విశాల భారతదేశ స్వరూపాన్ని అవగాహన చేసుకోడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ పటం చూస్తూండేవారికి హిమాచ్ఛాది తమయిన ఉన్నత పర్వత శిఖరాలు, నిర్మలజల ప్రపూర్ణములయిన జీవనదులు

సుందర ప్రకృతికి ఆట పట్టులయిన దుర్గమారణ్యాలు, పచ్చగా,, కన్నుల పండువుగా ఉన్న విశాలమయిన పచ్చిక బయళ్ళు — ఒక టేమిటీ, సుందరము, సుసంపన్నము, సర్వ సమృద్ధము అయిన భారతభూమి యొక్క యావత్తు స్వరూపము కళ్ళ ఎదుట సాక్షాత్కరించినట్లయింది.

కెప్టెన్ వివేకనందమూర్తి త్వరలోనే విమానం మీద భారతభూమి నలువైపులా చుట్టి రావడానికి సంకల్పించుకున్నారని దిన పత్రికలు ప్రకటించాయి. అయితే, ఈ ప్రయాణంలోని విశేషం ఏమిటంటే కెప్టెన్ వివేకానందమూర్తి శబ్ద వేగాన్ని మించిన వేగంతో మధ్యలో ఎక్కడా ఆగకుండా ప్రయాణిస్తారు. దేశపటం చూస్తున్న పిల్లలు, ఇంత విశాలమయిన దేశాన్ని విమానంలో చుట్టి రావడానికి సంకల్పించున్న కెప్టెన్ వివేకానందమూర్తి సాహసాన్ని తలచుకుని ఆశ్చర్యపోయారు. అందులోను తమ తరగతిలో చదువుతున్న తమ సహ పాఠియొక్క అన్నయ్య ఈ విధమైన సాహసిక చర్యకు పూనుకోవడం వారికి మరింత గర్వకారణమయింది.

"ఒక్కసారి మన మాతృభూమికేసి చూడండి." రాజారావు మాస్టారు దేశ పటాన్ని చూపిస్తూ అన్నారు. "సుందరము, స్వర్గతుల్యము అయిన మన భారత దేశాన్ని ఒకసారి తిలకించండి. ఎన్ని తులలేని ధాన్య రాసులను, వెలలేని వజ్రపు ప్రోవులను కనిపెంచినదీప రత్నగర్భ! ఎందరు వీరాధి వీరులను, పుణ్య పురుషులను కన్న దీ దివ్య సీమ! దేశం యొక్క పూర్వ ప్రస్తుత విభావాలను, గౌరవ ప్రతిష్టలను

నిలబెట్టటానికి భావి భారత వీరులయిన మీరందరు ముందుకి రావాలి. కవులుగా, గాయకులుగా, శిల్పులుగా, చిత్రకారులుగా, వైజ్ఞానికులుగా, వైద్యులుగా; సైనికులుగా, శ్రామికులుగా, మీ బాధ్యతలను మీరు సక్రమంగా, నిర్వర్తించాలి. నా శిష్యులయిన మీరందరు శ్రద్ధగా చదివి అభివృద్ధిలోకి వచ్చి దేశసేవ చేయడంకన్న నాకు కావలసిం దేమీ లేదు. అంతకన్న సంతోష ప్రదము, గర్వ కారణము అయిన విషయం నాకు ఈ ప్రపంచంలో మరొకటి లేదు. ఆ పరమేశ్వరుడే మిమ్ములను అనుగ్రహించుగాక !" అంటూ రాజారావు మాస్టారు పాఠం చెప్పడం ముగించారు.

## 2

"ఈ సంగతి మీరు విన్నారా ?" రాజారావు మాస్టారు మాస్టర్ల విశ్రాంతి తీసుకునే గదిలో అడుగు పెడుతూ అన్నారు. "వినయ విహార్ నుంచి ఓ కొత్తపిల్లవాడు ఇవాళ అయిదవ ఫారం; బి. సెక్షన్‌కి వచ్చాడు. ఆ అబ్బాయి కెప్టెన్ వివేకానందమూర్తి తమ్ముడట..."

"నిజంగానా మాస్టారూ ?" తెలుగు మాస్టారయిన చంద్రశేఖర శాస్త్రిగారు కుతూహలంగా ప్రశ్నించారు.

"ఆ అబ్బాయి ఎవరో కాని చాలా అదృష్ట వంతుడు నిజంగా కెప్టెన్ వివేకానందమూర్తి వంటి వీరునికి తమ్ముడు కావడం పూర్వ జన్మ సుకృతమే కాని మరొకటి కాదు." లెక్కల మాస్టారయిన రాఘవయ్య గారు కళ్లుమూసుకుని పైకి చూస్తూ అన్నారు.

"ఇంతకీ ఆ అబ్బాయి పేరు ఏమిటో చెప్పారు కాదు." సైన్సు మాస్టారయిన సత్యనారాయణగారు ఆసక్తిగా అన్నారు.

"ఆ అబ్బాయి పేరు విజయసారథి. మొత్తానికి తెలివి కలవాడిలాగానే కనిపిస్తున్నాడు." రాజారావు మాస్టారు అన్నారు

మాస్టార్లందరికీ విజయసారథి అంటే ఓ విధమైన అభిమానం, ఆదరం, సదభిప్రాయం కలిగింది. వాళ్లు వాడి యెడల ఓ ప్రత్యేకాసక్తి చూపించ సాగారు.

క్రమమంగా ఈ వార్త హెడ్మాస్టారు దాకా ప్రాకింది. మాస్టార్లు, పిల్లలు విజయసారథిని గూర్చి రక రకాలుగా చెప్పుకోవడం, వాడంటే ఓ విధమయిన శ్రద్ధ, కుతూహలం కనపర్చడం ఆయన్ను అమితంగా ఆశ్చర్య పరిచింది. కొద్దిగా కలవరపరిచింది కూడా.

"విజయసారథి విషయంలో మీరందరు నాకో చిన్న సహాయం చెయ్యాలి." హెడ్మాస్టారు ఓ రోజున మిగతా మాస్టార్లతో అన్నారు. "మీరు ఆ పిల్లవాడి యెడల ఏ విధమైన ప్రత్యేక ఆసక్తి కాని, శ్రద్ధ కాని చూపించారంటే అది ఒక రకంగా వాణ్ణి పాడుచేస్తుంది. ఏమంటే, మీరు చూపు తున్న ఆదరాభిమానాల వల్ల వాడిలో గర్వం తల ఎత్త వచ్చు. అట్టి గర్వం వల్ల చాలా చెడు ఫలితాలు కలుగు తాయి. వాడు, తను ఇంతవాణ్ణి కదా అనే అహంభావంతో సరిగా చదవకపోవచ్చు. తోటివారిని తక్కువగా చూడ వచ్చు. చివరికి తన మాస్టారంటేనే లెక్కచేయక పోవచ్చు.

కనుక, మనం ఈ విషయంలో చాలా జాగ్రత్త వహించవలసి ఉంటుంది. వాణ్ణి మామూలు విద్యార్థివలెనే భావించి తగిన కట్టుబాట్లలో అట్టేబెట్టాలి. వాడికి ఎక్కువ చనవు ఇవ్వక అదుపులో పెట్టాలి. వాడి క్షేమంకోరే వాళ్ళం కాబట్టి మనం ఈ విధమైన చర్యలు తీసుకోనక తప్పదు."

"అయితే ఒక్క సందేహం." సైన్సు మాస్టారయిన సత్యనారాయణ గారు అన్నారు. "కెప్టెన్ వివేకానందమూర్తి గారు తన తమ్ముణ్ని తనతోపాటు మద్రాసులోనే అట్టి పెట్టుకోక ఇక్కడ హాస్టల్‌లో ఉంచి చదివించడం ఆశ్చర్యంగా ఉంది."

"చూడండి మాస్టారూ. అవన్నీ వారి స్వవిషయాలు" హెడ్మాస్టారు గంభీరంగా అన్నారు. "వాటి ప్రసక్తి మనకి అనవసరం. నిజానికి వాటితో, అంటే, అటువంటి వివరాలతో మన కెట్టి సంబధం లేదు. పిల్లవాడి విషయమే మనకి కావలసింది విజయసారథి చదువు, ప్రవర్తన సక్రమంగా ఉన్నట్లు వాడు పూర్వం చదివిన స్కూలు _వారిచ్చిన సర్టిఫికేట్లని బట్టి తెలుస్తున్నది. మనకి కావలసింది కూడా అంతమట్టుకే! మిగతా వివరాలతో మనకి నిమిత్తంలేదు."

విజయ సారథి కెప్టెన్ వివేకానందమూర్తి తమ్ముడనే వార్త బడిలో దావానలంవలె వ్యాపించింది. ప్రతి విద్యార్థి వాణ్ని చూడాలని, వాడితో మాట్లాడాలని, ఎంతగానో ఉత్సాహ పడుతున్నందున అయిదవఫారం, 'బి' సెక్షన్ ఓ చిన్న సంతలా తయారయింది.

"నువ్వు కెప్టెన్ వివేకానందమూర్తి గారి తమ్ముడి వన్న మాట. నిజంగా ?"

"మొత్తానికి భలే అన్నయ్యని సంపాయించావులే !"

"మీ అన్నయ్యని గూర్చిన విశేషాలు మాకు చెప్పవూ ?"

అటువంటి ప్రశ్నలు వ్యాఖ్యలు ప్రతిరోజు వందలాదిగా విజయసారథి మీద వర్షించ బడుతుండేవి. వాడు ఎంతో ఓర్పుతో వాటి అన్నింటికి తగు జవాబులు ఇస్తుండేవాడు.

"నువ్వు తరగతిలో ఉండటం మా కెంతో గర్వ కారణం, నిన్ను గురించి చెప్పమంటూ ఇతర తరగతుల వాళ్ళు మమ్మల్ని వేధిస్తున్నారు." భీమశంకరం నవ్వుతూ అన్నాడు.

"అది సరేకాని, ఇంతకీ నువ్వు ఎప్పుడయినా విమానం ఎక్కావా ?" తరగతి మానీటరయిన మాధవరావు కుతూ హలంగా అడిగాడు.

"ఓ బోలెడన్ని సార్లు ఎక్కాను." విజయసారథి ఠీవిగా అన్నాడు. "నేను ఎక్కువగా వాంపైర్ జెట్ విమానాల్లో ఎక్కి ప్రయాణం చేశాను.

"వాంపైర్ జెట్ విమానాలంటే..." రాధాయి సందే హం వెలిబుచ్చాడు.

"వాంపైర్ జెట్ విమానాలంటే అనేక రకమయున విమానాలన్న మాట. గుర్రాల్లో ఎన్ని జాతులున్నాయో, విమానాల్లో అన్ని రకాలు వున్నాయి."

"నువ్వు ఇంకా ఏమైనా ఇతర రకాల విమానాలలో ఎక్కి ప్రయాణం చేశావా ?" మాధవరావు ప్రశ్నించాడు.

"ఆఁ, ఒక్కసారి డకోటా విమానంలోను, రెండుసార్లు కామోసు హెలికాప్టర్ విమానంలోను ప్రయాణం చేశాను."

"మరి, మీ అన్నయ్య దగ్గిర చాలా రకాల విమానాలు ఉన్నాయా ?"

"ఓ, లెక్కలేనన్ని రకాలు ! వాటి పేర్లు చెప్పడం మొదలు పెడితే ఓ పెద్ద గ్రంథమవుతుంది."

పిల్లలందరు మంత్రముగ్ధులవలె విమానాలను గురించి విజయసారథి చెప్పే విశేషాలను వింటున్నారు. అవన్నీ కట్టు కథలని, దినపత్రికల్లో చదివి చెప్పేసంగతులని, పాపం, వాళ్ళ కేం తెలుసు ?

"నువ్వు చెప్పేవిషయాలు వింటుంటే నాకుకూడా విమానం ఎక్కాలనిపిస్తున్నది. చివరికి, ఒక్క నిమిషం విమానంలో ప్రయాణం చేసినా చాలు." భీమశంకరం అన్నాడు ఉత్సాహంగా.

"విమానం ఎక్కగానే సరిపోదోయి పిచ్చినాయనా! ఎక్కినదగ్గిర నుంచి భయం పుట్టి ఎప్పుడు దిగుదామా అని పిస్తుంది, తెలుసా ?" రాధాయి అన్నాడు.

"అప్పుడు విమానం నడిపేవాళ్ళతో చాలా ఎత్తుకు పోనీయకుండా తక్కువ యెత్తులోనే విమానం నడపమని చెపుతాను."

"తక్కువ ఎత్తులో విమానం నడపడం అంటే కోరి చావును కొనితెచ్చుకోవడ మన్నమాట." విజయసారథి

తాను చదువుకున్న పుస్తకంలోని మాటలను గుర్తుకు తెచ్చు కుంటూ అన్నాడు.

"నేనొక సంగతి అడుగు తానుకాని, చెప్తావా?" రాధాయి మెల్లగా అన్నాడు.

"ఊఁ, త్వరగా అడుగు మరి."

"నువ్వు మీ అన్నయ్య దగ్గిర వుండక ఇక్కడవుండి చదువు కుంటున్నావు ఎందుకు?"

ఆ ప్రశ్న విజయసారథిని కాస్త కలవరపెట్టిన మాట వాస్తవం. కాని, వాడు వెంటనే తన కలవరపాటును కప్పి పుచ్చుకుని నెమ్మదిగా అన్నాడు." అందుకు గల కారణాలు చెప్పాలంటే చాలాసేపు పడుతుంది. అసలు నిజానికి పెద్దకార ణాలు అంటూ ఏమీలేవనుకో! మా అన్నయ్య ఇంకా మద్రాసులో స్థిరపడలేదు. ఏమంటే, ప్రభుత్వంవారు ఎప్పుడు ఎక్కడికి వెళ్ళమంటే తక్షణం అక్కడికి వెళ్ళాలిగా, అందు కని! ఇంకో కారణం, మద్రాసులో మాకు స్వంతఇల్లు కాని, దగ్గిర బంధువులు కాని లేరు. ఇవే ముఖ్యమయిన కారణాలు. అయితే మా అన్నయ్య నాకు తరచు ఉత్తరాలు వ్రాస్తుం టాడు."

విజయసారథి తన సంచీలోనుంచి ఓ పొడుగాటి కవరు తీసి చూపించాడు. దానిమీద, "కెప్టెన్ వివేకానందమూర్తి, భారతవైమానిక దళ కార్యాలయం, మద్రాసు." అనే చిరు నామా వ్రాసివుంది.

"మీ అన్నయ్య అక్షరాలుచాలా ముచ్చటగా ఉన్నాయి. మరి, మాకు ఆ ఉత్తరం చదివి వినిపించవూ?" భీమశంకరం ఆత్రంగా అన్నాడు.

"ఇంకానయం, ఆ ఉత్తరం ఇవ్వమనలేదు." రాధాయి భీమశంకరం కేసి వెక్కిరింపుగా చూస్తూ అన్నాడు." అట్లా ఇతరుల ఉత్తరాలు వినడం మంచిదికాదు, తెలుసా?"

రాధాయి ఆ విధంగా మాట్లాడం విజయ సారథిని ఆనందపరిచింది. వాడు అందుకుగాను రాధాయిని మనసులో ఎన్నోసార్లు అభినందించాడు.

"అయినా అడిగావు కాబట్టి అక్కడక్కడ ముఖ్యమైన విషయాలు చదివి వినిపిస్తాను." విజయసారథి ఉత్తరాన్ని సగంవరకు మడిచి, ఎవరికీ కనపడకుండా పట్టుకుని చదవడం ప్రారంభించాడు.

"నీకు వెంటనే జాబు వ్రాయనందుకు అన్యథా తలంచ వని ఆశిస్తున్నాను. విపరీతమయిన పనులు వత్తిడివల్ల నిమిషం కూడా తీరిక లేకుండా ఉంది. అదీగాక, త్వరలోనే మన దేశాన్ని మధ్యలో ఎక్కడా ఆగకుండా చుట్టిరావాలనే ప్రయత్నానికి కావలసిన సన్నాహం చేసుకోవడంలో ప్రస్తుతం నిమగ్నుడనై ఉన్నాను. ఇక నువ్వు శ్రద్ధగా చదువుతున్నావని తలుస్తాను. త్వరగా జాబు వ్రాస్తావుకదూ! నీ అన్నయ్య, వివేకానందమూర్తి".

విజయసారథి చుట్టూ చేరిన పిల్లలందరూ నోళ్లు తెరచుకుని శ్రద్ధగా ఆ ఉత్తరాన్ని వింటూ ఉండిపోయారు.

# 3

కెప్టెన్ కూనపులి వివేకానందమూర్తి అంటే తెలియని వారు భారతదేశంలో లేరు. విమానవీరుడుగా అతను దేశ మంతా ప్రసిద్ధి చెందాడు. వైమానిక దళాధిపతిగా అతను అటు ప్రభుత్వం వారి మన్ననలను ఇటు ప్రజల ఆదరాభి మానాలను పొందాడు.

మామూలు విమానచోదకుడుగా భారత వైమానిక దళంలో ప్రవేశించిన వివేకానందమూర్తి కొలది సంవత్స రాల్లోనే కెప్టెన్ అయినాడంటే అతని ధైర్య సాహసాలు, కార్యదీక్ష అద్భుతమని, అపూర్వమని చెప్పక తప్పదు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో ఆగ్నేయాసియాలో యుద్ధం ప్రజ్వరిల్లినప్పుడు వివేకానందమూర్తి బర్మా రంగంలో పని చేశాడు. అతని సాహసాన్ని, సమయస్ఫూర్తిని, శక్తి యుక్తులను గ్రహించిన ప్రభుత్వం అతన్ని త్వరలోనే ఒక చిన్నదళానికి నాయకుణ్ణి చేసింది. అటుపిమ్మట ఏప్రియల్ 1943 నుంచి ఆగస్టు 1945 వరకు జరిగిన అరకాన్, ఇంఫాల్ రంగాల్లో వైమానిక దళాధిపతిగా వివేకానందమూర్తి చూపిన ప్రజ్ఞా విశేషాలకు చిహ్నంగా అతనికి ఎన్నో ప్రశంసా పతకాలు బహూకరింప బడ్డాయి. వివేకానందమూర్తికి కెప్టెన్ హోదా ఇవ్వబడింది.

ఆ తర్వాత కెప్టెన్ వివేకానందమూర్తి మూడు సంవ త్సరాల పాటు విమాన పరీక్షాధికారిగా నియమింప బడ్డాడు. భారత ప్రభుత్వం కొత్తగా సంపాయించిన యుద్ధ విమానాలను పరీక్షించి, వాటిలో గల లోటుపాట్లను సవరించి, వాటికి

ఇంకా చేయవలసిన అభివృద్ధిని గూర్చి పైఅధికారులకి తెలియ చేయడం అతని బాధ్యత. అట్టి గురుతరమయిన బాధ్యతను ప్రశంసనీయంగా నిర్వర్తించి నందుకు కెప్టెన్ వివేకానంద మూర్తికి ఒక పతకం బహూకరింపబడింది.

పిమ్మట కెప్టెన్ వివేకానందమూర్తి కాశ్మీర్ యుద్ధంలో పనిచేశాడు. కాశ్మీర్ లోయనుంచి పాకిస్తానీ దురాక్రమణ దాడులను పారద్రోలడంలో భారత వైమానిక దళం చేసిన చరిత్రాత్మకమయిన కృషిలో కెప్టెన్ వివేకానందమూర్తి ప్రముఖ పాత్ర నిర్వహించాడు. అతని అద్వితీయ సేవను గుర్తించిన ప్రభుత్వం అతనికి ప్రథమ శ్రేణి అశోక చక్రాన్ని బహూకరించి గౌరవించింది.

కెప్టెన్ వివేకానందమూర్తి అనేక మయిన గురుతర బాధ్యతలను నిర్వహించాడు. అతడు ఎన్నో సార్లు శబ్దవేగానికి మించిన వేగంతో ప్రయాణంచేసి అంత వరకు గుర్తింప బడిన వేగ ప్రయాణాలను అధిగమించాడు. స్వాతంత్ర్య దినోత్సవం నాడు ఇతర జాతీయ ప్రాముఖ్యమయిన దినాలప్పుడు క్రొత్త ఢిల్లీలో ఎర్రకోటవద్ద ఏర్పాటు చేయబడే వైమానిక విన్యాసాలలో కెప్టెన్ వివేకానందమూర్తి విమానం తప్పకుండా ఉంటుంది. ప్రేక్షకుల తలల మీదుగా ఎగురుతూ వాళ్ళని ఆశ్చర్య చకితుల్ని చేసి తిరిగి అంతలోనే ఆకాశం లోకి దూసుకుపోవడం... అక్కడ, ఎంతో ఎత్తున రకరకాలయిన విన్యాసాలు చేయడంలో కెప్టెన్ వివేకానందమూర్తి విమాన చోదకుని నిపుణత, నిర్భీకత వ్యక్త మవుతుంది.

విజయసారథి అన్నయ్య అటువంటి విమాన వీరుడు!

# 4

విజయ సారథి కెప్టెన్ వివేకానందమూర్తి వంటి అన్నయ్య దొరికి నందుకు వాణ్ణి చూసి, తరగతిలోని పిల్లలందరు అసూయ పడడం ప్రారంభించారు. అంతేగాక, ప్రతివాడు "మా అన్నయ్య ..." ఏ పెద్దడాక్టరనో, ఇంజనీరనో, రచయితనో, చెప్పడం సాగించారు. వారి వారి అన్నయ్యలను గూర్చి ఉన్నవీ, లేనివీ, కలిపి గొప్పగా చెప్పుకోవడం ఆరంభించారు.

చివరికి భీమశంకరం కూడా, నిజానికి వాళ్ళ అన్నయ్యలో ఎట్టి ప్రత్యేకత లేకపోయినా, ఆయన్ను గురించి అదే పనిగా ప్రచారం చేయడం ప్రారంభించాడు. అయితే, భీమశంకరం అన్నయ్యలోని ప్రత్యేకతల్లా – ఆయన లావులో భీమశంకరం కంటే రెట్టింపు ఉంటాడు. ఆ మహాకాయుడు నడుస్తుంటే ఓ చిన్న గున్న ఏనుగు నడుస్తున్నట్లుగా ఉంటుంది.

"మా అన్నయ్య అంటే సామాన్యుడనుకుంటున్నారా ఏమిటి ?" భీమశంకరం అన్నాడు. "ఆయన ఒక్కసారి తనచేయి విదిలించాడంటే ఆ ప్రాంతంలో ఎంతమంది ఉన్నా బొక్కబోర్లా క్రింద పడవలసిందే! ఆయన భుజబలం అటువంటిది. ఇక, మా అన్నయ్య తలుచుకున్నాడంటే నాలుగు ఇడ్లీలను విరిచి ఒకేసారి నమలకుండా మింగ కలడు..."

"చచ్చాంపో, అట్లా అయితే మీ అన్నయ్య పొరపాటున ఏ చిన్న కాఫీహోటలులోకి వెళ్ళినా దాని అంతు

తేల్చుకోంది బయటికి రాడన్నమాట." రాధాయి నవ్వుతూ అన్నాడు.

"అసలు అంత చిన్న కాఫీహోటళ్ళలో తయారుచేసే ఫలహారాలు మా అన్నయ్యకి ఎందుకూ సరిపోవు. అందుకనే ఆయన ఎప్పుడూ పెద్ద పెద్ద కాఫీ హోటళ్ళకే వెడతాడు."

"మంచిది. అట్లాగే వెళ్ళమను. లేకపోతే ఛాలా ఇబ్బంది పడతాడు." విజయ సారథి వెక్కిరింపుగా అన్నాడు.

వాడి మాటలకి చుట్టూ చేరిన పిల్లలందరు గొల్లున నవ్వారు.

"మా అన్నయ్య పెద్ద రచయిత. ఎన్నో నవలలు, నాటకాలు వ్రాశాడు." రాధాయి అన్నాడు. "ఇప్పుడు మరో గొప్ప నవల వ్రాస్తున్నాడు."

"ఇంతకీ మా అన్నయ్య సంగతి మీకు తెలియదా? అతను బొంబాయిలోని ఓ పెద్ద నూనె కంపెనీలో పని చేస్తున్నాడు. నన్ను ఎప్పుడూ రమ్మంటాడు కాని, నేనే వెళ్ళడం లేదు. ఏమైనా, వచ్చే వేసవి శెలవుల్లో తప్పక వెడతాను." రాజు సగర్వంగా అన్నాడు.

"మా అన్నయ్య మొన్ననే ఐ. ఎ. యస్. పరీక్షకి కూచున్నాడు. ఇంకేముంది? త్వరలోనే కలెక్టరవుతాడు. మాధవరావు అన్నాడు.

ఈ విధంగా ప్రతిరోజు అయిదవఫారం 'బి' సెక్షన్‌లో 'అన్నయ్యలను గూర్చిన ప్రసక్తి తప్పకుండా వచ్చేది. కాని, మిగతా వాళ్ళ అన్నయ్యలందరిలోకి విజయసారథి అన్నయ్యే

చాలా ప్రసిద్ధుడు. ఆ సంగతి పిల్లలందరు ఏకగ్రీవంగా అంగీక రించారు.

అయిదవ ఫారం 'బి' సెక్షన్ విజయసారథి గూర్చి ఎంతగానో గర్వించేది. నిజానికి ఆ బడి మొత్తంలోకి ఏ తర గతిలోను విజయసారథి అన్నయ్యకి సరితూగగల 'అన్నయ్య' లేడు. ఆ కారణం వల్లనే అయిదవ ఫారం, 'బి' సెక్షన్ పిల్లలు విజయసారథిని, వాళ్ళ అన్నయ్యని చూసి అంతగా గర్వించే వాళ్ళు !

రోజూ ప్రొద్దుటిపూట తపాల బంట్రోతు తమ తర గతి చాయల కనపడితేచాలు, పిల్లలందరు అతన్ని ఇవాళ విజయసారథి కేమైనా ఉత్తరం వచ్చిందా ?" అంటూ వేధించుకు తినేవాళ్ళు.

కాని, తపాల బంట్రోతు కూడా సామాన్యుడు కాడు. పిల్లల మనస్తత్వం బాగా తెలిసినవాడు. అందుచేతనే రోజూ "ఆఁ, తప్పకుండా వస్తుంది. ఇవాళ కాదులే, రేపు;" అని చెప్పో, లేకపోతే "ఇప్పుడే మద్రాసులో విజయసారథికి వచ్చే ఉత్తరాన్ని తపాల పెట్టెలో వేశారు." అని చెప్పో, ఆ పిల్లలను సంతృప్తి పరిచేవాడు.

విజయ సారథికి మద్రాసు నుంచి సామాన్యంగా జాబులు వచ్చేవి కావు. వచ్చినా ఏ పదిహేను రోజులకి ఒక సారో వచ్చేవి. ఇక, ఆ రోజు అయిదవఫారం 'బి' సెక్షన్ పిల్లవాళ్ళ ఆనందానికి అంతులేదు. తరగతిలోంచి మాస్టారు బయటికి వెళ్ళడం ఆలస్యం, వాళ్ళందరు విజయసారథి చుట్టూ చేరి ఆ ఉత్తరంలోని విశేషాలు ఏమిటో చెప్పమంటూ వేధిం

చేవారు. కాని, విజయ సారథి మట్టుకు ఆ ఉత్తరాలను అంద రికీ చదివి విన్పించేవాడు కాదు. వినయ విహార్‌లోని తన గదికి వెళ్ళి ఏకాంతంగా చదువుకునేవాడు.

అయితే ఈ విధంగా వాళ్ళ అన్నయ్య దగ్గిర నుంచి వచ్చే జాబులను ఎవ్వరికీ చూపించకుండా, కనీసం చదివి విని పించకుండా ఉండటం వల్ల విజయ సారథిని గూర్చి పిల్లలం దరు అనుమానించసాగారు. కెప్టెన్ వివేకానందమూర్తికి విజయ సారథికి కల సంబంధంలో ఏదో పెద్ద రహస్యం ఉందని వాళ్ళు సందేహించడం మొదలు పెట్టారు. కాని, ఆ రహస్యమేమిటో మాత్రం వాళ్ళకి అవగించ అంతయినా అంతుచిక్కలేదు.

ఎవ్వరికీ జాబులు చదివి వినిపించకపోయినా విజయ సారథి వాళ్ళ అన్నయ్య బొమ్మలను రంగుల్లో తయారుచేసి చాలా మందికి ఇచ్చాడు. అడిగిన వారికల్లా వాళ్ళ అన్నయ్య ఫోటోలు ఉన్న ఆల్బంను చూపించేవాడు. నిజానికి ఆల్బంలో ఉన్న వన్నీ వివిధ పత్రికల్లో కత్తిరించి అంటించిన వన్న సంగతి ఆ పిల్లలకేం తెలుసు ? ఆ ఫోటోలన్నీ విజయసారథికి వాళ్ళ అన్నయ్య ఇచ్చినవే అని వాళ్ళ విశ్వాసం. అందుకే వాళ్లు ఆ ఫోటోలను చూసి ఎంతగానో సంబర పడేవారు. ఉన్నతమయిన ఫాలభాగం, విశాలమయిన కళ్లు, చక్కని ముక్కు—అన్నిటిని మించి కెప్టెన్ వివేకానందమూర్తి. అంద మయిన ఆజానుబాహు విగ్రహం ఆ పిల్లవాళ్ళను అమితంగా ఆకర్షించేది. విమానంలోంచి చేయూపుతున్నట్లు, విమా నాన్ని పరీక్షిస్తున్నట్లు, రాష్ట్రపతి, ప్రధానివంటి ప్రముఖులతో

సంభాషిస్తున్నట్లు — ఈ విధంగా వివిధ భంగిమల్లో ఉన్న కెప్టెన్ వివేకానందమూర్తి ఫోటోలను చూసి ఆ పిల్లలందరు ఆశ్చర్యపోయేవారు. వాళ్ళ అన్నయ్య ప్రభావం విజయసారథి మీద ఎంతగా పండిందంటే రోజుకి ఒక్కసారయినా రాజా రావు మాస్టారు వాడు ఏదైనా అల్లరి చేస్తుంటే అనేవారు :

"విజయ సారథీ, అల్లరి చెయ్యకుండా బుద్ధిమంతుడిలా కూచోలేవూ ? కెప్టెన్ వివేకానందమూర్తి వంటి వీరుని తమ్ముడివని తెలుసుకుని అయినా నువ్వు అందుకు తగినట్లు ప్రవర్తించాలి."

విజయసారథి పరిస్థితి ఈ కారణం వల్ల చాలా దుర్భరంగా సాగింది. వాడికి స్వేచ్ఛ లేకుండా పోయింది. ఇష్టం ఉన్నా లేకపోయినా, పాఠాలు ప్రతిరోజు చచ్చినట్లు చదవాలి. లేకపోతే, అటువంటి వీరుని తమ్ముడు ఇంత మంద బుద్ధి, శుద్ధ మొద్దుగా తయారవుతున్నాడని ప్రతి మాస్టారు అంటారు. తోటివాళ్లు ఎగతాళి చేస్తారు. అందువల్లనే వాడు సాధ్యమయినంతవరకు ఏరోజు పాఠాలను ఆరోజునే చదువుతున్నాడు. ఏవిధమయిన అల్లరికాని, చెడ్డపనులుకాని చేయకుండా జాగ్రత్త వహిస్తున్నాడు. లేకపోతే అందరు వాణ్ణి "మీ అన్నయ్యకి నువ్వు చెడ్డపేరు తెస్తున్నావు. ఈ సంగతి తెలిస్తే మీ అన్నయ్య ఎంత బాధపడతాడో నీకు తెలుసా ? కనుక, నువ్వు మంచి పిల్లవాడివని పేరు తెచ్చుకోవాలి" అంటూ హెచ్చరించేవారు.

అటువంటి వీరునికి తమ్ముడయినందుకు వాడు చెయ్య వలసినదల్లా వాళ్ళ అన్నయ్య పేరు ప్రతిష్ఠలు నిలబెట్టడమే! వాడికి మిగతా విషయాలతో ఎట్టి సంబంధము లేదు.

# 5

కొన్నాళ్లు గడిచేసరికి విజయసారథి పాతబడిపోయాడు. వాడంటే కొత్తలో ఉన్న మోజు క్రమంగా తగ్గిపోసాగింది. ఇప్పుడు వాణ్ణిగురించి బడిలో ఎవ్వరూ అంతగా పట్టించుకోవటం లేదు. కాని, ఇంతలో ఓ విశేషం జరగడంతో మళ్ళీ విజయసారథిని గూర్చి నలుగురు చెప్పుకోవడం ప్రారంభించారు. వాడంటే పిల్లలందరు గౌరవం చూపించసాగారు. ఇంతకీ, విజయసారథి పేరులోకి రావడానికి కారణమయిన విశేషం ఏమంటే వాడు హాకీఆటలో మొనగాడు కావడమే! సాటిలేని మేటి ఆటగాడు కావడమే! ఓ వారంరోజుల క్రితం బడిలో ఆరవఫారం జట్టుకి, అయిదవఫారంవాళ్ళ జట్టుకి హాకీ పోటీ ఏర్పాటు చేయబడింది. ఆరవఫారంవాళ్ళ జట్టులో హేమాహేమీలయిన ఆటగాళ్లు ఉన్నారు. హాకీ ఆటలో అంతవరకు బడిలో అద్వితీయుడుగా పరిగణింపబడుతున్న శ్రీనివాసరావు ఆరవఫారంవాళ్ళ జట్టుకి నాయకుడు. అంతటి పటిష్టమయిన జట్టు అయిదవఫారంవాళ్ల జట్టు చిత్తుగా ఓడించిందంటే అందుకు కారణం విజయసారథి. ఆనాడు విజయసారథి ఆడిన ఆట చూసి హెడ్మాస్టారితో సహా అందరు దిగ్భ్రాంతులయ్యారు. అయిదవఫారంవాళ్ల జట్టు చేసిన పది

గోలుల్లోను తొమ్మిదిగోలుల్లు విజయసారథి సాధించినవే! వాడు బంతిని కొట్టడం, అవతలవాళ్ల గోలులోకి సూటిగా బంతిని పంపడం — అక్కడ చేరినవాళ్లందరికీ కొత్తగాను, అత్యద్భుతంగాను తోచింది.

అంతేగాక, ఆట ఆడేటప్పుడు తనజట్టువాళ్లకి విజయ సారథి ఇస్తున్న ఆజ్ఞలు, సలహాలు; ఆ ధోరణి, ఆ సైనిక పరి భాష ప్రేక్షకులను ముగ్ధులుగా చేసింది.

"సిద్ధంగా ఉండండి, బంతివస్తున్నది."

"బంతి జాగ్రత్త. ఎడమవైపుకి గట్టిగా కొట్టు."

"ధైర్యంగా బంతిని ముందుకు తీసుకువెళ్లు, హుషార్."

"నీ కుడివైపు చూడు. మనశత్రువు ఉన్నాడు. ప్రాణం పోయినా బంతినిమాత్రం అందివ్వకు."

"నెమ్మది, నెమ్మది. మన ముట్టడి చాలా నేర్పుగా ఉండాలి."

"భేష్, భేష్. బ్రహ్మాండంగా ఆడావు. ఈ దెబ్బతో మనకి మరోగోలు తప్పదు."

విజయసారథి ఈవిధంగా తన జట్టువాళ్ళకి ఆజ్ఞలు ఇవ్వడం చూసిన ప్రేక్షకులకి అది హాకీఆటని అనిపించలేదు. ఏ చిన్న యుద్ధరంగమో అనిపించింది.

ఆ ఒక్క ఆటతోనే విజయసారథి అయిదవఫారంవాళ్ల జట్టుకి నాయకుడుగా చేయబడ్డాడు. బడి మొత్తంలోను ఆ జట్టుతో పోటీచేసే జట్టే లేకపోయింది. చివరికి ఆరవఫారంవాళ్ల జట్టు నాయకుడయిన శ్రీనివాసరావుకూడా విజయసారథి తన కంటె బాగా ఆడతాడని అంగీకరించాడు.

తర్వాత, ఆ పట్టణంలోనే ఉన్న మరో బడి జట్టుతో జరిగిన పోటీలో తను చదువుతున్న బడిజట్టుకి విజయసారథి నాయకత్వం వహించాడు. అప్పుడుకూడా విజయసారథి తన పూర్వ నైపుణ్యం చూపించి అవతలజట్టు చిత్తుగా ఓడిపోవడానికి కారణమయినాడు. దాంతో వాడిపేరు వాళ్ళ బడిలోనే గాక పట్టణంలోకూడా తెలిసింది. విజయసారథిని గురించి, హాకీఆటలో వాడి నైపుణ్యాన్ని గురించి నలుగురు గొప్పగా చెప్పుకోవడం ప్రారంభించారు.

# 6

ఓ రోజున రేడియో, కెప్టెన్ వివేకానందమూర్తి భారతదేశాన్ని చుట్టిరావడానికి బయల్దేరాడనేవార్త ప్రసారం చేసింది. ఈ వార్తను దినపత్రికలుకూడా ప్రముఖంగా ప్రకటించాయి. ఆ వార్తతో పాటు కెప్టెన్ వివేకానందమూర్తి జీవిత విశేషాలు, అతను పూర్వం వివిధ యుద్ధరంగాల్లో చూపిన ప్రజ్ఞా ప్రాభవాలు, ధైర్య సాహసాలు – వగైరా వివరాలనుకూడా దినపత్రికలు మొదటి పుటలో ప్రచురించాయి. నిజానికి కెప్టెన్ వివేకానందమూర్తి సంకల్పించిన కార్యం సామాన్యమయిందికాదు. భారతదేశాన్ని మధ్యలో ఎక్కడా ఆగకుండా చుట్టి రావడమంటే సామాన్యం కాదు. అట్టి పని కెప్టెన్ వివేకానందమూర్తి వంటి ప్రవీణుడయిన విమానచోదకుడు చెయ్యవలసిందే కాని సామాన్యులకు సాధ్యంకాదు.

ఇందుకుగాను కెప్టెన్ వివేకానందమూర్తి ఎన్నుకున్న విమానం ఒకే సీటు కలిగి అత్యంత శక్తివంతమయిన ఇంజనులతో అధిక వేగంతో పోయేటటువంటిది. ఆ విమానం ప్రత్యేకంగా ఇటువంటి కార్యక్రమాలకోసమే నిర్మింపబడింది. భారతప్రభుత్వ ఆధ్వర్యాన నడుపబడుతున్న బెంగుళూరులోని హిందూస్తాన్ ఎయిర్‌క్రాఫ్ట్ ఫ్యాక్టరీ ఆ విమానాన్ని నిర్మించింది. ఆ విమానాన్ని పరీక్షించిన విదేశనిపుణులు భారతీయుల మేధాశక్తికి, నిర్మాణ కౌశలానికి జోహారు లర్పించారు. ఆ విమానమే ఇప్పుడు కెప్టెన్ వివేకానందమూర్తి చోదకత్వం క్రింద భారతదేశాన్ని చుట్టి రావడానికి బయలుద్దేరింది!

అయిదవఫారం, 'బి' సెక్షన్ పిల్లలు ఆ వార్త విని ఎంతగానో ఉప్పొంగిపోయారు. తమ తరగతిలోని విద్యార్థి అన్నయ్య అటువంటిఘన నకార్యానికి పూనుకోవడం వాళ్ళకి అమితమయిన సంతోషంతోపాటు గర్వాన్నికూడా కలిగించింది. ఏకొద్ది విశ్రాంతి దొరికినా వాళ్లు విజయసారథిచుట్టూ చేరి వాళ్ళ అన్నయ్య సాహసాన్నిగూర్చి పొగడటం ప్రారంభించేవారు. ఆరోజున ఎవ్వరికీ పాఠాలు వినాలనిపించలేదు. వాళ్ల ధ్యాసఅంతా కెప్టెన్ వివేకానందమూర్తిమీదే ఉన్నది.

ఆ సాయంత్రం రేడియో ఈవిధంగా చెప్పింది:

"ప్రస్తుతం కెప్టెన్ వివేకానందమూర్తి హిమాలయ పర్వతాలమీదుగా ప్రయాణం చేస్తున్నారు. కాని, ఓ గంట క్రితంనుంచి ఆయన సమాచారం తెలియడంలేదు. ఎందువల్లనో ఆయన దగ్గిరనుంచి ఎట్టి వార్తలు రావడంలేదు.

ప్రభుత్వ వర్గాలవారు ఈ విషయమై చాలా ఆదుర్దా పడు తున్నారు..."

మరుసటిరోజు విజయసారథి తరగతికి నీరసంగా వచ్చాడు. వాడుముఖం కళావిహీనంగా ఉంది. కళ్లు ఎర్రబడి రాత్రి వాడు నిద్రపోలేదన్న విషయాన్ని సూచిస్తున్నాయి. వాడు చాలా దిగులుగా ఉన్నట్లు కనిపించాడు. వాడికేసి చూడటానికి, వాణ్ణి పలకరించడానికి ఎవ్వరికీ ధైర్యం చాలడం లేదు. ప్రతివాడు వాడికేసి జాలిగా, సానుభూతిగా చూడటం మొదలుపెట్టారు. కెప్టెన్ వివేకానందమూర్తి సమాచారం ఏమీ తెలియరావడంలేదని ప్రొద్దున రేడియో చెప్పిన వార్త వాళ్ళను మరింత కృంగతీసింది.

"ఏం ఫరవాలేదు సారథీ, మీ అన్నయ్య క్షేమంగా తిరిగివస్తాడు." రాధాయి సానుభూతిగా అన్నాడు.

"మధ్యాహ్నం రేడియోలో ఏసంగతి తెలుస్తుందిగా?" మాధవరావు అన్నాడు.

"ఇంతకీ కెప్టెన్‌గారి విమానం ఎక్కడ ప్రయాణం చేస్తున్నదో!" రాజు ఆలోచనగా అన్నాడు.

"ఆ సంగతి తెలిస్తే ఈ ఆదుర్దా అంతా ఎందుకు?" రాధాయి అన్నాడు. "ఏమైనా కొన్ని గంటల్లోనే వివేకానంద మూర్తిగారి సంగతి తెలుస్తుందని నా నమ్మకం."

"నన్నడిగితే ఇందుకు కారణం కెప్టెన్‌గారి విమానంలో ఉన్న రేడియో చెడిపోయిఅయినా ఉండాలి, హిమాలయాల వాతావరణం రేడియో పంపే వార్తలను రాకుండా నిరోధిస్తూ అయినా ఉండాలి..." భీమశంకరం అన్నాడు.

పాఠాలులు జరుగుతున్నంతసేపు మాష్టార్లు, పిల్లలు వెనుకబెంచీలో కూచున్న విజయసారథిమీద ఓ కన్ను వేసే ఉంచారు. తల వంచుకుని విచారంగా కూర్చున్న వాణ్ని చూసే సరికి అందరికి జాలికలిగింది. మూడవ పీరియడు లెక్కలు. లెక్కల మాస్టారయిన రాఘవయ్యగారు తరగతిలోకి వచ్చీరావడంతోటే తాను గతవారం చెప్పినట్లు ఈ పీరియడులో లెక్కల పరీక్ష జరుగుతుందని చెప్పారు. తరువాత రాఘవయ్యమాష్టారు తలవంచుకుని కూచున్న విజయసారథి దగ్గిరికి వెళ్లిఆప్యాయంగా వాడి బుజంమీద చేయివేసి అన్నారు :

"నీవు మీ అన్నయ్యను గురించి చాలా దిగులుపడు తున్నట్లున్నావు. ఏం భయంలేదు సారథీ, మీ అన్నయ్యకి ఏమీ భయంలేదు. త్వరలోనే అతని క్షేమవార్త మనకి తప్పక వస్తుంది చూడు! మరి, నువ్వు ఇప్పుడు లెక్కలపరీక్షకి కూచుంటావా, లేదా? నీ మనసు బావుండకపోతే మాత్రం పరీక్షకి కూచోవద్దు."

'నామనసు బాగానేఉంది మాస్టారూ" విజయసారథి లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు. "నేను పరీక్షకి కూచుంటాను."

"అయితే నీ ఇష్టం."

ఆనాడు క్లాసుపరీక్షలో ఇచ్చిన లెక్కలు ఏమంత కఠిన మయినవి కావు. కాని, విజయసారథిమాత్రం ఏ కారణం వల్లనో వాటిలో ఒక్క లెక్కనుకూడా చేయలేకపోయాడు. వాడు లెక్కలు చెయ్యడం మాని ఓ కాగితంమీద విమానం

బొమ్మలు వేయడం మొదలుపెట్టాడు. ఎన్నో విమానాలను రకరకాలుగా చిత్రించాడు. విజయసారథి వ్యవహారం మొదటి నుంచి గమనిస్తున్న రాధాయి వాణ్ణి చూసి ఎంతో జాలి పడ్డాడు. ఇచ్చిన మూడులెక్కల్లో ఒక్క లెక్కనుకూడా చెయ్యలేదు. రాధాయి మెల్లగా తన లెక్కల పుస్తకాన్ని విజయసారథి దగ్గరికి నెట్టి దాంట్లో చూసి లెక్కను వేసుకో మని సైగచేశాడు. కాని, విజయసారథి ఆ విషయం పట్టించు కోలేదు. వాడు మామూలుగా విమానాలను చిత్రించడంలో నిమగ్నుడయ్యాడు.

తరగతిలోని పిల్లలందరు ఒక్కొక్కరే తమ లెక్కల పుస్తకాలను మాస్టారికి ఇచ్చి బయటికి వెళ్ళిపోవడం ప్రారం భించారు. వాళ్ళు బయటికి వెడుతూ, వెడుతూ విజయసారథి కేసి కుతూహలంగా చూడటం సాగించారు. కాని, విజయ సారథిమట్టుకు ఆ గొడవ ఏమీ పట్టించుకోకుండా తలవంచు కుని లెక్కలు చేయడం మొదలుపెట్టాడు.

చివరికి భీమశంకరంకూడ తన లెక్కలపుస్తకం మాస్టా రికి ఇచ్చి బయటికి వచ్చాడు.

"విజయసారథి ఎన్ని లెక్కలు చేశాడురా?" రాజు ఆత్రంగా ప్రశ్నించాడు.

"నేను బయటికి వచ్చేసరికి వాడు అసలు లెక్కలు మొదలుపెట్టలేదు. ఇప్పుడయినా మొదలుపెట్టాడంటావా?" రాధాయి అన్నాడు.

"నేను సరిగా చూడలేదు. అయితే వాడు తలవంచు కుని మొత్తానికి ఏమిటో వ్రాస్తున్నాడు" భీమశంకరం అన్నాడు.

బయట చేరిన పిల్లలందరు మెల్లగా కిటికీవద్దకు చేరి విజయసారథికి వినపడేట్లుగా లెక్కను చేసే విధానం చెప్పడం మొదలుపెట్టారు. కొందరు బుద్ధిమంతులు కాగితంమీద లెక్కను వేసి విజయసారథికి అందించడానికి తగు ప్రయత్నం చేస్తున్నారు. ఈ హడావిడిలో వాళ్ళు హెడ్మాస్టారు తమ వెనుక నిలబడి ఉన్నట్లుకూడా గమనించలేదు.

"ఇదిగో అబ్బాయిలూ, మీరందరు ఇక్కడ ఏంచేస్తున్నారో తెలుసుకోవచ్చా?" హెడ్మాస్టారు గంభీరంగా అన్నారు.

హెడ్మాస్టారి మాటలు విన్న పిల్లలందరు భయంతో వణికిపోతూ వెనక్కి తిరిగి చూశారు. వాళ్ళలో ఒక్కడి ముఖానకూడా నెత్తురుచుక్క లేదు.

"ఈ విధమయిన డొంకతిరుగుడు మార్గాల ద్వారా మీరు పరీక్షల్లో కృతార్థులు కాలేరన్న విషయాన్ని మీకు ఎన్నో చెప్పాను. శ్రద్ధగా చదవడంద్వారా అభివృద్ధిలోకి వస్తారు కాని, ఈవిధమయిన అసమార్గాలను అవలంబించి ఎన్నటికీ పైకి రాలేరు. అందులోను పరీక్షలు జరుగుతున్నప్పుడు ఇట్లా జవాబులు లోపలివారికి అందించడానికి ప్రయత్నించడం మహాపరాధం. కనుక మీరు వెంటనే ఇక్కడి నుంచి వెళ్ళి, గంట కొట్టిన తర్వాత తిరిగి క్లాసుకు రండి. ఊc, ఒక్కొక్కరే నిశ్శబ్దంగా వెళ్ళిపోండి."

పిల్లలు అందరు ఎక్కడివాళ్లు అక్కడ మెల్లగా ప్రక్కకి తప్పుకున్నారు. కాని, హెడ్మాస్టారు అట్లా వెళ్లారో, లేదో తిరిగి తరగతి గది కిటికీదగ్గర చేరారు.

ఇంకా గంట కొట్టడానికి ఓ అయిదునిమిషాలు వ్యవధి ఉండనగా విజయసారథి మెల్లగా బయటికి వచ్చాడు. పిల్లలందరు వాడి చుట్టూ చేరి ప్రశ్నల వర్షం కురిపించ సాగారు.

"లెక్కలన్నీ చేశావా, ఏరా సారథీ?" రాధాయి ప్రశ్నించాడు.

"నీకు వచ్చిన ఆన్సర్లు ఏమిటో చెప్పు చూద్దాం." భీమశంకరం అన్నాడు.

విజయసారథి మూడులెక్కలికి తనకి వచ్చిన ఆన్సర్లు చెప్పాడు.

"అన్ని ఆన్సర్లు సరిగానే ఉన్నాయి." రాధాయి సంతోషంగా అన్నాడు. "నీవు కాసేపట్లోనే మూడులెక్కలు చేయడం నాకు ఆశ్చర్యంగా ఉంది."

"మరి మనం అంటే ఏమనుకున్నావు? ఎటువంటి జటిలమయిన లెక్కనైనా త్రుటిలో చేయగలం." విజయసారథి సగర్వంగా అన్నాడు.

గంటకొట్టిన తర్వాత పిల్లలందరు తిరిగి తరగతిలోకి వెళ్ళి ఎవరి స్థలాల్లో వాళ్లు కూచున్నారు. నాలుగవ పీరియడు తనది గాకపోయినా రాజారావుమాస్టారు తరగతిలో ప్రవేశించడం చూసి పిల్లలందరు ఆశ్చర్యపోయారు. రాజారావు మాస్టారు నేరుగా వెళ్లి విజయసారథి భుజంమీద చేయివేసి సంతోషంగా అన్నారు:

"విన్నావా విజయసారథీ! మీ అన్నయ్య క్షేమంగా తిరిగి మద్రాసు చేరుకున్నారుట. ఇప్పుడే రేడియో ఈ వార్త

చెప్పింది. ఈ సంతోషకరమయిన వార్త చెప్పడానికే నేను ఇప్పుడు ఇక్కడికి వచ్చాను."

"చాలా సంతోషం మాస్టారూ! మా అన్నయ్య క్షేమంగా తిరిగివచ్చాడు. సంకల్పించుకున్న పని సాధించాడు. నాకు అంతే చాలు." విజయసారథి తలవంచుకుని మెల్లగా అన్నాడు.

కెప్టెన్ వివేకానందమూర్తిగారి సంగతి మధ్యాహ్నానికి తప్పక తెలుస్తుందని నేను ఎప్పుడో చెప్పాను. సరిగా అట్లాగే జరిగింది" రాధాయి అన్నాడు.

"ఇంతకీ కెప్టెన్‌గారి దగ్గిరనుంచి ఇంతవరకు వార్తలు రాకపోవడానికి కారణం ఏమిటి మాస్టారూ?" భీమశంకరం ప్రశ్నించాడు.

"వారి విమానంలో ఉన్న రేడియో హఠాత్తుగా పని చేయడం మానివేసిందిట. దానికితోడు వాతావరణంకూడా సరిగా లేదుట. అందువల్లనే వార్తలు రాలేదుట."

ఇక, అయిదవఫారం, 'బి' సెక్షన్ పిల్లల ఆనందానికి అంతులేదు. వాళ్ళ హృదయాలు ఏదో చెప్పరాని సంతోషంతో నిండిపోయాయి. వాళ్లు విజయసారథిని, కెప్టెన్ వివేకానందమూర్తిని ఒకటేమయిన పొగడటం ప్రారంభించారు.

ఆపూట నాలుగవ పీరియడులో పాఠం జరిగే ప్రాప్తం లేకపోయింది.

# 7

వారం రోజులు గడిచాయి. ఓరోజున దినపత్రికల్లో ఈ క్రిందివార్త ప్రముఖంగా ప్రకటించబడింది :

"ఈమధ్యనే భారతదేశాన్ని మధ్యలో ఎక్కడా ఆగకుండా విమానంలో చుట్టివచ్చిన కెప్టెన్ కూనపులి వివేకానందమూర్తిగారు త్వరలోనే తమ స్వంతపనిమీద విజయవాడ రానున్నారు. వారి రాకనుగూర్చిన వివరాలను తరువాత ప్రకటిస్తాం."

దినపత్రికల్లో ఈ వార్త చదివిన అయిదవఫారం, 'బి' సెక్షన్ పిల్లల ఆనందానికి అంతులేదు. అప్పుడే తరగతిలో అడుగుపెట్టిన విజయసారథి చుట్టూ చేరి ఈ వార్తను కాస్తా వాడిచెవిన వేశారు. ఆ వార్త వినగానే వాడు ఎగిరి గంతు వేసి ఏంతో హంగామా చేస్తాడని పిల్లలందరు ఊహించారు. కాని, వాళ్ళ ఊహ నిజంకాలేదు. ఆ వార్త విన్న విజయ సారథి ఏందువల్లనో ఉత్సాహం చూపలేదు సరికదా పైన ఎంతగానో దిగాలుపడినట్లు కనిపించాడు. వాడి ముఖం కళ తప్పింది. ఏమాట లేకుండా తల వంచుకుని మౌనంగా ఉండి పోయాడు.

పిల్లలందరు విజయసారథి వ్యవహారం చూసి తెల్లపోయారు. వాడు ఆవార్త వినగానే అమాంతంగా నీరసించిపోవడానికి కారణమేమిటో వాళ్ళకి ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

"ఏంజరిగిందిరా సారథీ, అట్లా దిగులుగా ఉన్నావు ?" రాధాయి ఆత్రంగా అడిగాడు. "మీ అన్నయ్య మన పట్టణం రావడం నీకు సంతోషంగా లేదా ?"

విజయసారథి వెంటనే తన విచారాన్ని కప్పిపుచ్చుకుని లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ, అన్నాడు:

"మొత్తానికి భలే ప్రశ్న వేశావు! మా అన్నయ్య ఈ పట్టణం వస్తాడనే వార్త నాకు ఎంత సంతోషాన్ని కలిగించిందో చెప్పలేను. మా అన్నయ్య రాకనుగురించి నేను ఆలోచిస్తుంటే మీరు నన్ను మరోవిధంగా అర్థంచేసుకున్నారు."

"అది సరేకాని, మరి మీ అన్నయ్య దగ్గరనుంచి నీకు ఉత్తరం ఏమీ రాలేదా?" మాధవరావు ప్రశ్నించాడు.

"ఊఁహుఁ, రాలేదు. ఇవాళో, రేపో రావచ్చు."

ఆ రోజు నుంచి విజయ సారథి ప్రవర్తనలో విపరీతమయిన మార్పు వచ్చింది. ఇంతకు పూర్వం ఎంతో హుషారుగా ఉండేవాడు. ఇప్పుడు దిగులు పడిన వాడికి మల్లే నీరసంగా కనిపిస్తున్నాడు. తరగతిలో ఎవ్వరితోను మాట్లాడకుండా మౌనంగా ఉంటున్నాడు, సాధ్యమయినంత వరకు తప్పించుకు తిరుగుతూ ప్రతివాడితోను తక్కువగా మాట్లాడటానికి ప్రయత్నం చేస్తున్నాడు. మాస్టారు అడిగే ప్రశ్నలకి కూడా సరిగా సమాధానాలు చెప్పడం లేదు. పిల్లలందరు విజయ సారథి ప్రవర్తనలో వచ్చిన మార్పులు చూసి ఆశ్చర్యపోయారు. అర్థంగాక తికమక పడ్డారు.

ఓ రోజు రాధాయి, విజయ సారథిని ఈ విషయాన్ని గూర్చి ప్రశ్నించాడు. కాని, వాడు ఆ ప్రశ్నకి సరియైన సమాధానం చెప్పకపోగా, పైన రాధాయిని కసిరాడు. ఇతరుల స్వంత విషయాల్లో జోక్యం కలిగించుకోవడం అంత మంచి పని కాదంటూ హెచ్చరించాడు.

ఒకసారి భీమశంకరంతో ఓ చిన్న విషయం మీద విజయ సారథి తగాయిదా పడ్డాడు. ఇద్దరికి చేతులు చేతులు కలిసే పరిస్థితి వచ్చేసరికి రాధాయి వెళ్ళి వాళ్ళ ఇద్దరిని విడదీసాడు.

"నువ్వు విమాన వీరుడి తమ్ముడివయినా నేను లెక్క చేయను, తెలిసిందా ? సొచి లెంపకాయ కొట్టానంటే మీ అన్నయ్య దగ్గిరికి వెళ్ళి తిరిగి రావాలి." భీమశంకరం బిగ్గరగా అన్నాడు.

"అట్లాగే కాసేపు వాగావంటే అంతపని నీకు ఎట్లాగూ తప్పదు. ఇంతకీ, మన దెబ్బ రుచి చూడనట్లుంది. ముక్కు, ముఖం చదరమైపోవాలి, జాగ్రత్త." విజయ సారథి తీవ్రంగా అన్నాడు.

మాస్టారు క్లాసులో ప్రవేశించడంతో ఆ దెబ్బలాట అంతటితో అంతమయింది.

విజయ సారథి హాకీ ఆట కూడా సరిగా ఆడటం లేదు. దానిమీద కూడా వాడి శ్రద్ధ తప్పింది. ఇక, తరగతిలో చూద్దామా, ఒక్క ప్రశ్నకి సమాధానం చెప్పడంలేదు. మాస్టారు పాఠం చెపుతుంటే, వాడు ఆ గొడవే పట్టించుకోకుండా కిటికీలోంచి బయటికి చూస్తూ కూచునేవాడు. రాజారావు మాస్టారు విజయసారథిలో వచ్చిన మార్పును చూసి విస్తుపోయారు. ఆయన ఎన్నోసార్లు వాణ్ణి సంగతి ఏమిటో చెప్పమని అడిగారు. కాని, విజయసారథి ఏమీ లేదంటూ తప్పించుకునేవాడు. తనను ఒంటరిగా ఉండనీయమని, తనకి ప్రశాంతత కావాలని చెప్పేవాడు. సరసుడు, సంభాషణా

ప్రియుడు, స్నేహపాత్రుడు అయిన విజయసారథి విచిత్రంగా కొద్దిరోజుల్లోనే పెడసరి, మితభాషి, మిత్రద్వేషిగా మారి పోయాడు. చదువు, హాకీఆట, చివరికి తన అన్నయ్య రాకపట్ల కూడా వాడు తగిన ఆసక్తికాని, ఉత్సాహంకాని చూపడం లేదు.

రాజారావుమాస్టారు విజయసారథిని గూర్చి తీవ్రంగా ఆలోచించారు, వాణ్ణి ఎట్లాగయినా మార్చాలని నిర్ణయించు కున్నారు. అందుకోసం వెంటనే తగు ప్రయత్నంకూడా ప్రారంభించారు.

"ఏరా రాధాయి, విజయసారథి, నువ్వు ప్రాణస్నేహి తులు కదూ ?" ఓరోజున రాజారావుమాస్టారు రాధాయిని పిలిచి ప్రశ్నించారు.

"అది పూర్వంసంగతి మాస్టారూ! వాడు ఇప్పుడు నాతో సరిగా మాట్లాడడంకూడా చాలించుకున్నాడు." రాధాయి మెల్లగా అన్నాడు.

"ఎప్పుడూ దిగులుగా ఉంటాడు మాస్టారూ. ఏదో ఆలోచిస్తున్నవాడికిమల్లే మౌనంగా ఉంటాడు." మాధవరావు అన్నాడు,

"మొన్న నాతో ముష్టియుద్ధానికి సిద్ధమయ్యాడండీ. రాధాయికనుక అడ్డం రాకపోతే అంతపనీ జరిగేదే!" భీమ శంకరం అన్నాడు.

"అయితే ఓపనిచేద్దాం. సారథిలో తిరిగి పూర్వ శ్రద్ధా శక్తులను, ఉత్సాహాన్ని తెప్పించాలంటే ఒక్కటే మార్గం ఉంది. అదేమంటే, ఆరవఫారంవాళ్ళ జట్టుకి, మీజట్టుకి హాకీ

పోటీ ఏర్పాటు చేయడం సారథి మీ జట్టుకి నాయకుడు కాబట్టి తప్పక ఆడతాడు. అవతలజట్టువాళ్ళని ఓడించడానికి తీవ్రంగా ప్రయత్నంచేస్తాడు. దాంతో పూర్వంవలె ఉత్సాహవంతుడుగాను, స్నేహపాత్రుడుగాను తయారవుతాడు. మరి, మీ అభిప్రాయం ఏమిటి ?" రాజారావు మాస్టారు ప్రశ్నించారు.

"అంతా మీ ఇష్టం మాస్టారూ! మీరు ఎట్లాచెపితే అట్లా చేస్తాం" అందరూ ఒకేసారి అన్నారు.

# 8

రాజారావు మాస్టారి ఊహ అక్షరాలా నిజమయింది. ఆరవఫారంవాళ్లు తిరిగి పోటీకి సిద్ధపడుతున్నారనే వార్త రాధాయి వాళ్లు విజయసారథితో చెప్పేసరికి వాడు మొదట ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకున్నట్లు కనిపించలేదు. ఓసారి చిన్నగా నవ్వి ఊరుకున్నాడు. కాని, రాధాయి వాళ్ళు విజయసారథిని అంతటితో వదిలిపెట్టలేదు. ఆరవఫారంవాళ్ళ జట్టుమీద ఉన్నవీ, లేనివీ కలిపి చెప్పడం ప్రారంభించారు.

"అబ్బ, నేను ఆమాటలు వినలేకపోయా ననుకో!" రాధాయి ముఖం చిట్లించి, చెవులు మూసుకుంటూ అన్నాడు. "మీ జట్టులో విజయసారథి ఉంటే ఏం, వాడి తాత ఉంటే ఏం ? మాకేం లెక్కలేదు, తెలుసా ?" అని అన్నారు.

"నిజంగా ?" విజయసారథి కోపంగా అన్నాడు. "వాళ్ల వ్యవహారం అంతదాకా వచ్చిందన్నమాట. ఈసారికాని వాళ్ల తిక్క కుదర్చను."

"హుఁ, ఆ శ్రీనివాసరావుగాడికి ఎంత గర్వమో చెప్పలేం. 'ఏదో పిల్లవాళ్ళని ఆషామాషీగా ఆడితే మీరు గెల్చారుగాని లేకపోతే అసలు ఒక్క గోలన్నా చేసేవారా? ఈసారి రండి చూద్దాం. మిమ్మల్ని చిత్తుగా ఓడించి, నెత్తికి సున్నం పూసి పంపకపోతే అప్పుడు అడగండి' అని శ్రీనివాస రావుగాడు అన్నాడు. వాడిమాటలు వింటుంటే నాకు ఒళ్ళు మండిపోయిందనుకో..." భీమశంకరం లేని పౌరుషం తెచ్చి పెట్టుకుంటూ అన్నాడు.

"అంతేనా? ఇంకా చాలా మాటలు అన్నాడు." వెంటనే రాజు అందుకున్నాడు. 'ఈసారి ఆటలో కాని విజయ సారథి అంతు తేల్చను. తానే మహా బాగా ఆడతానని వాడికి చాల గర్వం ఉందిలే! ఆ గర్వాన్ని పూర్తిగా వదుల గొట్టందే ఊరుకోను' అంటూ నిన్ను తెగ తిట్టిపోశాడురా! కావాలంటే రాధాయి వాళ్ళను కూడా అడుగు. వాళ్లు కూడా అప్పుడు అక్కడే ఉన్నారుగా..."

"అయితే కానీయ్, ఈ దెబ్బతో ఆ శ్రీనివాసరావు గాడి అంతో, నా అంతో తేలిపోవాలి." విజయసారథి రోషంగా అన్నాడు. "నేను ఒక్కణ్ణే పది గోలులకి తక్కువ చేస్తే అడగండి."

"నువ్వు తల్చుకున్నావంటే పది గోలులేం కర్మ, తేలిగ్గా ఇరవై గోలులు చేయగలవు." రాధాయి విజయసారథి బుజం మీద చేయి వేసి హుషారుగా అన్నాడు. "మరి ఇంతకీ మనం ప్రాక్టీసు ఎప్పటి నుంచి ప్రారంభిద్దామంటావు?"

"ఇంకా ఆలస్యం ఎందుకురా అనవసరంగా? రేపటి నుంచే తప్పకుండా ప్రారంభిద్దాం."

అంతే! ఆ రోజునుంచి విజయసారథిలో ఓ గొప్ప మార్పు కలిగింది. వాడు పూర్వం మాదిరిగా హాకీ ఆటపట్ల శ్రద్ధ చూపుతున్నాడు. క్రమ క్రమంగా పాఠాలు కూడా బాగానే చదువుతున్నాడు. వాడిలో కలిగిన ఈ మార్పుకి రాజారావు మాస్టారు, రాధాయి, మాధవరావు, భీమశంకరం -అందరు సంతోషించారు.

ఓ రోజు సాయంకాలం విజయసారథి వాళ్లు హాకీ ఆట ప్రాక్టీసుముగించి ఇంటికి వెడుతుండగా దారిలో వాళ్ళకి శ్రీనివాసరావు కనిపించాడు.

"ఏరా శ్రీనివాసరావు. మీ ప్రాక్టీసు బాగా సాగుతున్నదా?" భీమశంకరం ప్రశ్నించాడు.

"ఓ, బ్రహ్మాండంగా సాగుతున్నది. ఈ సారి మీకు ఓటమి తప్పదు." శ్రీనివాసరావు సగర్వంగా అన్నాడు.

"ఎవరు ఓడిపోయేది పోటీ రోజున తెలుస్తుందిలే. తొందర పడకు!" విజయసారథి అన్నాడు. "అదిసరే కాని, నేను లేకుండా చూసి రాధాయి వాళ్ళ దగ్గిర అట్లా గొప్పలు చెప్పుకున్నావుట ఎందుకు నాయనా! అదేమంత మంచి పని కాదు."

"ఉన్నమాటేఅన్నాను. అందులో గొప్ప ఏమీలేదు."

"అట్లాగా. నేను ఒక్క గోలు కూడా చేయలేనని చెప్పావుట, నీకు ఆ సంగతి ఎట్లా తెలుసు? ఈ మధ్య జ్యోతిష్యం ఏమైనా నేర్చుకుంటున్నావేమిటి?"

"ఈ మాత్రానికి జ్యోతిష్యం కూడా నేర్చుకోవా లేమిటి ?" శ్రీనివాసరావు వెక్కిరింపుగా అన్నాడు. "నువ్వు ఒక్క గోలు అయినా చేసినప్పుడు చూద్దాంగా..."

హుం, ఒక్క గోలు ఆట ప్రారంభమయిన ఒక్క నిముషంలోనే చేస్తాను. అట్లా చేయకపోతే నా పేరు విజయ సారథి కాదు, తెలుసా ?"

"సరేలే. ఇప్పుడు తొందర పడడం ఎందుకు ? పోటీ రోజున నీ సత్తా, నా సత్తా, తెలుస్తుందిగా..."

"ఆహాఁ, తప్పక తెలుస్తుంది. నేను ఇప్పుడు చెప్పిన మాట అక్షరాలా నిజమని నువ్వే ఆ రోజున అంటావు. జ్ఞాపకం పెట్టుకో."

పోతే ఇంకా రెండు రోజులు ఉండనగా దిన పత్రికల్లో ఈ వార్త ప్రకటించ బడింది :

"కెప్టెన్ వివేకానందమూర్తి గారు రేపటిరోజున విజయ వాడ వస్తున్నారు..."

కెప్టెన్ వివేకానందమూర్తికి ఘన స్వాగత మివ్వడానికి విజయవాడ పురపాలక సంఘం, పురప్రముఖులు నిర్విరామంగా కృషి చేస్తున్నారు. పట్టణ మంతా తోరణాలతో అలంకరిస్తున్నారు. ముఖ్యంగా స్టేషన్ నుంచి రహాదారి బంగళాకు వెళ్ళే వీధులను ముచ్చటగా తీర్చి దిద్దుతున్నారు. ప్రతి వీధి మొదట్లోను కెప్టెన్ వివేకానందమూర్తి చిత్రం ప్రముఖంగా ప్రదర్శింప బడుతున్నది. తన అన్నయ్య బొమ్మలను చూస్తూంటే, విజయ సారథి మనసులో ఓ విధమైన ఆందోళన చెలరేగింది. ఓ వైపు ఆనందం పొంగి పొర్లింది.

తన అన్నయ్య నవ్వు ముఖం చూస్తూంటే. వాడిలో ఎన్నో ఆలోచనలు రేకెత్తాయి.

"మీ అన్నయ్య రేపే వస్తున్నాడటగా, నిజమేనా ?" రాధాయి అన్నాడు.

"ఎప్పుడు వచ్చేదీ నీకు ఉత్తరం వ్రాయలేదా !" భీమ శంకరం ఆత్రంగా అడిగాడు.

"మీ అన్నయ్య వస్తే మేం జ్ఞాపకం ఉంటామో, లేదో ? ఆ సంబరంలో పడి మమ్మల్ని మరిచిపోకురోయ్..." రాజు నవ్వుతూ అన్నాడు.

విజయ సారథికి వాళ్ళ మాటలు సంతోషాన్ని కలిగించడానికి బదులు చిరాకును పుట్టించాయి. వాడిలో ఏదో చెప్పరాని ఆందోళన ప్రారంభమయింది,

"ఈ కబుర్లకి ఏమొచ్చె కాని, ముందు ఆట ప్రారంభించండి." కిష్టాయి అన్నాడు. "ఇట్లా ప్రాక్టీసు చేస్తే మనకి ఓటమి తప్పదు. ఊc, త్వరగా ఎవరి స్థలాల్లోకి వాళ్ళు వెళ్ళండి."

అదేం విచిత్రమో కాని విజయసారథి మళ్ళీ పూర్వం వలె తయారయ్యాడు. తరగతిలోని వాళ్ళందరిని తప్పించుకుని తిరగడానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఎవ్వరితోను సరిగా మాట్లాడటం లేదు. చదువు పట్ల కూడా శ్రద్ధ తప్పింది. మాస్టారు పాఠం చెపుతుంటే వాడు ఆ సంగతే పట్టించుకోకుండా కిటికీలోంచి బయటికి చూస్తూ కూర్చునేవాడు. రాజారావు మాస్టారు వాడి ధోరణి చూసి ఎంతగానో విచారించారు. క్రమంగా ఈ సంగతి హెడ్మాస్టారి దాకా వెళ్ళింది.

"నీ వ్యవహారం ఏమీ బాగా లేదు సారథీ! రాజారావు మాస్టారు నీ సంగతి అంతా చెప్పారు. ఇట్లా అయితే ఇక ముందు సహించేది లేదు. తెలిసిందా ? మీ అన్నయ్యకి నీ విషయం జాబు వ్రాయవలసి వస్తుంది."

విజయ సారథి హెడ్మాస్టారి మాటలకి జవాబు చెప్ప లేదు.

"ఏ సంగతి వెంటనే జవాబు చెప్పు. అట్లా మౌనం వహించి లాభం లేదు." హెడ్మాస్టారు కఠినంగా అన్నారు.

"మీ ఇష్టం. మీరు ఎట్లా చేసినా నాకు అంగీకారమే!" విజయ సారథి మెల్లగా అన్నాడు.

"చివరికి ఈ సంగతి మీ అన్నయ్యకి జాబు వ్రాసినా..."

విజయ సారథి అవునన్నట్లు తల త్రిప్పాడు.

"ఊఁహూఁ, అంతదాకా వచ్చిందన్నమాట నీ వ్యవహారం. సరే, అయితే..." అంటూ హెడ్మాస్టారు ఓ జాబు వ్రాసి కవరులో పెట్టి విజయ సారథి చేతికి ఇచ్చారు. "ఈ జాబు తీసుకు వెళ్ళి రేపు మీ అన్నయ్య వచ్చినప్పుడు ఆయనకి ఇవ్వు! నీతో అంతకన్నా చెప్పవలసిందేమీ లేదు. ఇక నీవు వెళ్ళ వచ్చు.

హెడ్మాస్టారు మామూలుగా చాలా మంచివారు. అతి సౌమ్యులు. తొందరపడి ఏ నిర్ణయానికి వచ్చేవారు కాదు. కాని, విజయ సారథి ప్రవర్తన ఆయనకి కోపం తెప్పించింది. ఆ కోపంలో వారు విజయ సారథి అన్నయ్యకి ఆ జాబు వ్రాశారు. ఆ జాబువల్ల ఎట్టి ఫలితం కలుగుతుందోనని

కూడా వారు ఆలోచించలేదు. తరువాత ఇతర విషయాల్లో నిమగ్నులైనారు. ఆ జాబు సంగతే మరిచిపోయారు.

కెప్టెన్ వివేకానందమూర్తి వచ్చే రోజు వచ్చింది. మద్రాసు నుంచి గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో వారు ఆ సాయంకాలమే విజయవాడ వస్తారు. కెప్టెన్ వివేకానంద మూర్తికి స్వాగత మివ్వడానికి గాను బడి వదిలి పెట్టిన తర్వాత స్టేషన్‌కి వెళ్ళడానికి అయిదవ ఫారం 'బి' సెక్షన్ పిల్లలు నిర్ణయించుకున్నారు. స్టేషనుకి హెడ్మాస్టారు, రాజారావు మాష్టారు వగైరాలు కూడా వస్తారనే వార్త వాళ్ళను మరింత సంతోష పరిచింది. తమ తరగతిలో చదువుతున్న తమ సహచరుని అన్నయ్యకి స్వాగత మివ్వడం తమ విధిగా వాళ్ళు భావించారు. అందులోను, అఖిల భారతఖ్యాతి నార్జించిన ఆ విమాన వీరుడికి జేజేలు చెప్పడం తమకి గర్వ కారణమని వాళ్లు తలంచారు.

ఆ రోజునే విజయ సారథి విచిత్రంగా అంతర్ధాన మయినాడు.

వాడు ప్రొద్దుటే తన పుస్తకాలు, హాకీ బ్యాటు తీసుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు వాడి గదిలోనే ఉంటున్న ఒక్క రాజుతో మాత్రం చెప్పి వెళ్లాడు. అదీ, తను రాధాయి ఇంటికి వెడుతున్నాననీ? మామూలుగా బడికి వస్తానని మాత్రమే చెప్పాడు. కాని, ఆ రెండు మాటలు అబద్ధ మని తర్వాత తేలింది. వాడు బడికి రాలేదు. తమ ఇంటికి రాలేదని రాధాయి చెప్పాడు. పిల్లలందరు ఆ వార్త విని విస్తుపోయారు. విజయ సారథి బడికి ఎందుకు రాలేదో, వాళ్ళకి

అర్థం కాలేదు. రాజారావు మాస్టారు విజయ సారథి తరగతిలో లేకపోవడం చూసి ఆశ్చర్యపోయారు. వాడు బడికి ఎందుకు రాలేదని ఆయన చాలా మందిని ప్రశ్నించారు. కాని ఒక్కడు కూడా అందుకు సరియైన సమాధానం చెప్పిన పాపాన పోలేదు. ప్రతివాడు తనకి తెలియదంటే తనకి తెలియదన్నాడు. రాజారావు మాస్టారు ఆ సంగతి నెమ్మదిగా హెడ్మాస్టారితో చెప్పాడు. ఆయన మొదట ఆశ్చర్యపోయినా తరువాత కాస్సేపు ఆలోచించిన మీదట మెల్లగా అన్నారు :

"విజయ సారథి సంగతి నిన్న మీరు చెప్పారు కదా! వెంటనే నేను వాణ్ణి పిలిపించి అసలు విషయ మేమిటో సవిస్తరంగా చెప్పమని అడిగాను, కాని, వాడు పెడసరంగా సమాధానం చెప్పేసరికి నాకు కోపంవచ్చి, వాళ్ల అన్నయ్యకి ఇవ్వమంటూ ఓ జాబు వ్రాసి వాడికి ఇచ్చాను. బహుశః ఆ జాబు చూపిస్తే వాళ్ళ అన్నయ్య ఏమన్నా అంటాడేమోనని భయపడి వాడు బడికి రాకుండా ఎక్కడికో పోయి ఉంటాడు. మీ అభిప్రాయం ఏమిటని ?" హెడ్మాస్టారు రాజారావు మాస్టారిని అడిగారు.

"నేనూ అట్లాగే అనుకుంటున్నాను." రాజారావు మాస్టారు మెల్లగా అన్నారు. "కాని, పాపం విజయ సారథిని చూస్తే నాకు విచారం కలుగుతుంది. తల్లి, తండ్రి లేనివాడు. తనకి ఉన్న ఒక్క అన్నయ్యకికూడా దూరంగా ఉంటున్నాడు. అన్నిటిని మించిన అమాయకుడు. అటువంటివాడు ఈ విధంగా పారిపోయాడంటే నాకు ఎంతో విచారంగా ఉంది.

ఇంతకీ మనం ఇప్పుడు ఏం చేద్దామంటారు ? వాళ్ళ అన్నయ్య వచ్చి తన తమ్ముడు ఎక్కడ ఉన్నాడని అడిగితే మనం ఏమని సమాధానం చెప్పగలం ? నాకు ఏమీ తోచకుండా ఉంది."

కాని, హెడ్మాస్టారు ఏమీ మాట్లాడ లేదు. ఆయన మౌనంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు.

# 9

విశాలమయిన విజయవాడ స్టేషన్ విద్యుద్దీపాల కాంతిలో శోభాయమానంగా ఉంది. కెప్టెన్ వివేకానంద మూర్తికి స్వాగత మివ్వడానికి గాను వచ్చిన పుర ప్రముఖుల తోను, ప్రజలతోను, పిల్లలతోను స్టేషనంతా కలకలలాడు తున్నది. ప్లాట్ఫారం ఆ చివరనుంచి ఈ చివరి వరకు బారులు తీరి నిలిచిన పిల్లలు చేసే గోలతో స్టేషను మహా సందడిగా ఉంది. పిల్లలను నిశ్శబ్దంగా ఉంచడానికి హెడ్మాస్టారు, ఇతర మాస్టారులు తమ శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నారు. కాని, పిల్లలు మట్టుకు సామాన్యులా ? హెడ్మాస్టారు తమ దగ్గిరికి వచ్చినప్పుడు మాత్రం బుద్ధిమంతులవలె గోలచేయ కుండా ఉండేవారు. ఆయన అటు తిరగడం ఆలస్యం, వాళ్ళు మళ్ళీ యథాప్రకారంగా గోల ప్రారంభించేవారు.

ఇంతలో వాళ్ళకి దూరంగా రైలు ఇంజను కనిపించింది. ఆ ఇంజను నుంచి వచ్చే కాంతి వాళ్ళకి స్పష్టంగా అగు పిస్తున్నది. పిల్లలు తమ సంతోషాన్ని పట్టలేక పెద్దగా కేకలు వేస్తూ గట్టిగా చప్పట్లు కొట్టారు. అంతలోనే రైలు రొద

చేస్తూ స్టేషనులో ప్రవేశించింది. పిల్లలందరు కెప్టెన్ వివేకానందమూర్తిని చూడటానికి త్రోక్కిసలాడుతున్నారు. ఒక్కొక్క పెట్టెనే వెతుక్కుంటూ హడావిడిగా ముందుకి నడవసాగారు. ఆవిధంగా కొన్ని పెట్టెలు దాటేసరికి వాళ్ళకి ఓ మొదటితరగతి పెట్టె వాకిలివద్ద నిలబడి చిన్నగా మందహాసం చేస్తున్న కెప్టెన్ వివేకానందమూర్తి కనిపించారు. వాళ్లు అంతకు పూర్వమే ఎన్నోసార్లు అతని బొమ్మను దినపత్రికల్లోను, విజయసారథి ఆల్బంలోను చూసిఉండటంవల్ల వెంటనే గుర్తించకలిగారు. ఇక వాళ్ళ ఆనందానికి అంతులేదు. ఒళ్ళంతా కళ్లుచేసుకుని కెప్టెన్ వివేకానందమూర్తికేసి కుతూహలంగా చూడసాగారు.

కెప్టెన్ వివేకానందమూర్తి ఖాకీరంగు కోటు, అదే రంగు పొడుగులాగు తొడుక్కున్నాడు. కోటుకి ఎడమవైపున, జేబుకి పైన రకరకాల పతకాలు వ్రేలాడుతున్నాయి. తల మీద చక్కని టోపీ ఉన్నది. పిల్లలందరు అతనికేసి ఉత్సాహంగా చూస్తూ నిలబడిపోయారు.

అందరికంటె కెప్టెన్ వివేకానందమూర్తిగారిని స్పష్టంగాను, చక్కగాను చూడాలనే ఉద్దేశ్యంతో భీమశంకరం ఓ జాజిచెక్కల సామానుపెట్టె ఎక్కాడు. ఓ నిముషంసేపు అతన్ని పరిశీలనగా చూసినమీదట వాడు తనదగ్గిరగా నిలబడివున్న పిల్లలతో మెల్లగా అన్నాడు:

"అంతా మన విజయసారథి పోలికే! కొద్దిగాకూడా భేధంలేధు."

"నిజంగా? చాలామంది పిల్లలు భీమశంకరం కేసి కుతూహలంగా చూస్తూ అడిగారు.

"నిజంగానే! అబద్ధం చెప్పే కర్మ నాకేం వచ్చింది? కావాలంటే మీరుకూడా జాగ్రత్తగా చూడండి."

"మాకు ఇక్కడినుంచి సరిగా కనిపించడంలేదు. అందుకే నిన్ను అడగటం..."

"నేను చెప్పానుగా. విజయసారథికి వివేకానంద మూర్తిగారికి ఎట్టిభేదంలేదు. ఆ ముక్కు...ఆఁ మరి..."

"ఇంకా ఎక్కువ చెప్పనవసరం లేదులే! మన విజయ సారథికిమల్లేనే వివేకానందమూర్తిగారికి కూడా ముక్కు ముఖంమధ్యనే ఉన్నదా? జాగ్రత్తగా చూసి చెప్పరోయ్, పొరపాటు పడేవు." పిల్లలందరు వేళాకోళంగా అన్నారు.

ఇంతలో ఎవరో ఓ తుంటరిపిల్లవాడు భీమశంకరం కాలు పట్టుకుని లాగాడు. ఇంకేముంది? అసలే లావుపాటి మనిషి, అందులో నోరు తెరచుకుని, మునివేళ్ళమీద నిలబడి చూస్తున్నాడు. కాలు పట్టు తప్పగానే దభీమని క్రిందపడి, ఏడవబోయి, ప్రక్కవాళ్ళు వేళాకోళం చేస్తారని ఎట్లాగో తమాయించుకున్నాడు.

కెప్టెన్ వివేకానందమూర్తిగారికి మొట్టమొదట పుర పాలక సంఘాధ్యక్షుడు దండవేశాడు. తదుపరి పట్టణంలోని వివిధసంస్థలతరఫున పూలమాలలు వేయబడ్డాయి. హైస్కూలు మాస్టార్ల తరఫున హెడ్మాస్టారు, పిల్లలకుగాను రాధాయి చెరొక దండ వేశారు. పిమ్మట ఒక్కొక్కరే కెప్టెన్ వివేకా నందమూర్తిగారిని గూర్చి, వారి ధైర్యసాహసాలను గూర్చి

ఉపన్యాసాలు చేశారు. వివేకానందమూర్తి ఆ ఉపన్యాసాలను శ్రద్ధగా వింటూ, మధ్యమధ్య చిరునవ్వు నవ్వుతూ నిలబడ్డారు.

చివరికి రాధాయికూడా ఉపన్యాసం చెప్పడానికి సిద్ధపడ్డాడు. అంతకుపూర్వమే ఇంటిదగ్గర బట్టీపెట్టిన నాలుగు మాటలను చెప్పడం ప్రారంభించాడు:

"హైస్కూలు పిల్లలమయిన మేము మీకు...విమానవీరులయిన మీకు...స్వాగతమివ్వడానికి గర్విస్తున్నాం"

తరువాత ఏంచెప్పాలో రాధాయికి తోచలేదు. వాడికి గొంతు ఎండిపోతున్నట్లు అనిపించింది. నోటినుంచి మాట రావడమే గగనమవుతున్నది. అందులోను అంతమంది జనం ముందు మాట్లాడటం వాడికి కొత్తకావడంవల్ల భయం భయంగా ఉంది. అదీగాక, కెప్టెన్ వివేకానందమూర్తి తన ఉపన్యాసం మధ్యలో అడ్డువచ్చి, "అంతా బాగానే ఉందికాని, మరి మా తమ్ముడు విజయసారథి ఎక్కడ ?" అని అడుగుతాడేమో నని వాడు సందేహించసాగాడు. కాని, కెప్టెన్ వివేకానందమూర్తి ఏమీ మాట్లాడలేదు. రాధాయి చెప్పే మాటలను శ్రద్ధాసక్తులతో వినసాగాడు.

రాధాయి ఉపన్యాసం ముగించాడు. తదుపరి కెప్టెన్ వివేకానందమూర్తి తనకి ఇంత ఘన సన్మానం చేసిన వారందరికీ కృతజ్ఞత తెలియచేశాడు. వెంటనే స్టేషన్ నుంచి రహదారి బంగాళాకు బయల్దేరాడు.

# 10

రాధాయి స్టేషన్‌నుంచి ఇంటికి వెళ్లాడు. గుమ్మందగ్గరగా తలుపు వెనుక వాడికి ఏదో తెల్లని కాగితంవంటిది కనిపించింది. రాధాయి గబగబా వెళ్ళి ఆ కాగితం ఏమిటోనని తీసి చూశాడు. అది నోటుపుస్తకంలోంచి చింపబడిన రూళ్ళ కాగితం. కవరుగా మడచబడింది. రాధాయి ఆమడత విప్పాడు ఆత్రంగా. వాడికి కొన్ని అక్షరాలు కనిపించాయి. వాడు ఆ అక్షరాలు విజయసారథివని ఇట్టే పోల్చుకోకలిగాడు. ఇక, వాడి ఆనందానికి, ఆదుర్దాకి అంతులేదు. విజయసారథి బహుశః తనకే ఆఉత్తరం వ్రాసిఉంటాడు. ఏమని వ్రాశాడో? వ్రాయడానికి కారణమేమిటో ? అసలు విజయసారథి ఎక్కడ ఉన్నట్టు? ప్రొద్దుటనుంచి ఎక్కడ తిరుగుతున్నాడు? రాధాయి బుర్రలో ఇటువంటి ప్రశ్నలు ఎన్నో బయల్దేరాయి. వాడు ఆ ఉత్తరాన్ని తనగదిలోకి తీసుకువెళ్ళి, ఎవ్వరూ చూడకుండా ఉండేందుకు తలుపులు బిగించి మరీ చదవడం ప్రారంభించాడు.

విజయసారథి ఈవిధంగా వ్రాశాడు:

"రాధాయి, నువ్వు ఈ జాబు చూసిన వెంటనే పార్కుకు వచ్చి; మామూలుగా మనం రోజూ కూచునే బల్ల మీద కూచోవలసిందిగా కోరుతున్నాను. నేను అక్కడే నీకోసం నిరీక్షిస్తుంటాను. నీతో కొన్ని అత్యవసర విషయాలు మాట్లాడాలి. అదీ, చాలా రహస్యంగా మాట్లాడవలసి ఉంటుంది. కనుక ఈసంగతి ఎవ్వరికీ చెప్పకుండా, ఆఖరికి మీ అమ్మ గారికికూడా; సరిగా ఎనిమిదిగంటలకి పార్కుకి రావలసిందిగా కోరుతున్నాను. నువ్వు నా ప్రాణస్నేహితు

డివి, నమ్మకస్తుడివి కనుక నీకు ఈజాబు వ్రాస్తున్నాను. అత్యా వసరం. తప్పక వస్తావుకదూ! నీ మిత్రుడు, విజయసారథి."

"8 గంటలకి...పార్కులో...అతిరహస్యం" రాధాయి మనసులో ఎన్నో ఆలోచనలు, ఎన్నో అనుమానాలు కదిలాయి. కాని, వాడికి ఒకవిధంగా చాలా సంతోషం కలిగింది. ఏమంటే, తను తిరిగి విజయసారథిని చూడబోతున్నాడు. వాడు తను కనపడకుండా పోవడానికి కల కారణా లేమిటో తప్పక తనకి చెపుతాడు. రాధాయి తరువాత ఒక్కక్షణంకూడా ఆలస్యం చేయలేదు. గబగబా భోజనం చేసి, పుస్తకాలు తీసుకుని, తను స్నేహితుని ఇంటికి చదువుకోడానికి వెడుతున్నానని వాళ్ళమ్మతో చెప్పి తిన్నగా పార్కుకి బయల్దేరాడు.

రాధాయి పదినిమిషాల్లో పార్కు చేరుకున్నాడు. విజయసారథి చెప్పినట్లు తాము మామూలుగా కూచునే బల్ల దగ్గిరికి వెళ్లి కూచున్నాడు.

"రాధాయి!" ఎవరో తనను పేరుపెట్టి పిలవడంతో రాధాయి చటుక్కున వెనక్కి తిరిగి చూశాడు.

గుబురుగా పెరిగిన పూలమొక్కల చాటున ఓ తెల్లని ఆకారం కదిలింది.

"ఎవరూ?" రాధాయి మెల్లగా అన్నాడు.

"నేనురా...సారథిని" అంటూ విజయసారథి వచ్చి రాధాయిప్రక్కనే కూర్చున్నాడు.

"నువ్వేననుకున్నానులే!" రాధాయి సారథి ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అన్నాడు. "అదిసరేకాని, ప్రొద్దుట నుంచి ఎక్కడ ఉన్నావురా? నీకోసం అందరూ ఎదురుచూస్తు

న్నారు. అసలు నువ్వు ఎవ్వరికీ కనబడకుండా ఉండటానికి కారణం ఏమిటి? నిజంచెప్పు."

"నిజమే చెపుతాను కాని, ముందు నువ్వు నాకోక వాగ్దానం చెయ్యాలి" విజయసారథి అన్నాడు.

"అది ఏమిటో త్వరగా అఘోరించుమరి..." రాధాయి తీవ్రంగా అన్నాడు.

"అంత కోపమయితే ఎట్లారా? చెపుతున్నాను విను. ఇప్పుడు నేను నీకు చేప్పే సంగతి బ్రహ్మదేవుడికైనా చెప్ప నని ఒట్టువెయ్యి."

"బ్రహ్మదేవుడికి ఏమోకాని, నాకు తెలిసినంతలో ఎవ్వ రికి చెప్పనని మాత్రం ఒట్టువేయగలను. ముందు అసలు ఆ సంగతేమిటో చెప్పు."

"ఒట్టువేస్తేకాని చెప్పను."

రాధాయి విజయసారథిచేతిలో చేయివేశాడు.

"నేను చెప్పబోయే సంగతి విని నవ్వవుకదా!" విజయ సారథి అన్నాడు.

"నీ ధోరణి నాకేమీ అర్థం కావడంలేదురా సారథీ! నన్ను ఇంతదూరం పిలిపించింది ఊరికే తమాషాకన్నమాట."

"నేను ఇప్పుడు ఓ పెద్ద ఆపదలో ఉన్నాను. దీనినుంచి ఎట్లా బయటపడాలో నాకు తెలియకుండా ఉంది. ఇంతకీ నేను చెప్పే సంగతి నువ్వు ఎవ్వరికి చెప్పకూడదు. వింటు న్నావా?"

"ఆఁహాఁ. చక్కగా వింటున్నాను. నీ దయవల్ల నాకు ఇంకా చెముడు రాలేదు. రెండు చెవులు చక్కగానే పని చేస్తున్నాయి."

"మరి, నేను చెప్పబోయే సంగతి ఎవ్వరికి చెప్పవు కదూ?"

"చెప్పను...చెప్పను...చెప్పను. చాలా? లేకపోతే ఇంకో లక్షసార్లు చెప్పను, చెప్పను అంటూ జపం చెయ్యమంటావా? అసలుసంగతి చెప్పకుండా ఇట్లా ప్రాణం తీస్తున్నావేమిటోయ్ మహానుభావా!" రాధాయి విసుగ్గా అన్నాడు.

"తొందరపడకు మరి. అసలు సంగతి ఏమంటే... ఏమంటే...నేను అతని తమ్ముణ్ణికాదు." విజయసారథి వినీ వినపడనట్లు అన్నాడు.

"అతనంటే ఎవర్రా? వివరంగా చెప్పు."

"నీకు తెలుసుకదోయ్! మళ్ళీ నా నోటిమీదగా చెప్పిద్దామనేగా నీ ప్రయత్నం."

"నీమాటలు నాకు ఏమీ అర్థంకావడంలేదురా సారథీ! ఎవరో 'అతను' అంటే నాకెట్లా తెలుస్తుంది చెప్పు" రాధాయి అన్నాడు.

"మీరనుకుంటున్నట్లు నేను కెప్టెన్ వివేకానందమూర్తిగారి తమ్ముణ్ణి కాదు..."

"వేళాకోళానికికూడా కాస్త వేళా పాళా ఉండాలిరా అబ్బాయి." రాధాయి చిన్నగా నవ్వుతూ అన్నాడు. "నువ్వు కెప్టెన్‌గారికి తమ్ముడివి గాక తాతవి అవుతావా?"

"నీకంతా సవ్వులాటగా ఉంది." సారథి తలవంచుకుని నెమ్మదిగా అన్నాడు. "నిజం చెప్పినా నమ్మకపోతే నేనేం చేస్తాను చెప్పు. ప్రమాణపూర్తిగా చెపుతున్నాను, నేను కెప్టెన్ వివేకానందమూర్తిగారి తమ్ముణ్ణికాదు."

నిజంగానా సారథీ ?" రాధాయి ఆ విషయాన్ని నమ్మలేనట్లుగా అన్నాడు. నిజంగానా..."

నిజంగా రాధాయి ! ఈ సంగతి చెప్పడానికే నేను నిన్ను ఇప్పుడు ఇక్కడికి రప్పించాను."

"అయితే మరి నువ్వు ఎవరివంటావు ?" రాధాయి అయోమయంగా అన్నాడు.

"నేనా ? కూనపులి విజయ సారథిని. కొంపదీసి నా పేరు విషయం కూడా నీకు అనుమానంగా ఉందా ?"

"నీ పేరు సంగతి అట్లాఉంచి, ముందు అసలు సంగతి చెప్పు మీది ఏఊరు ? కెప్టెన్ వివేకానందమూర్తిగారికి, నీకు ఉన్న సంబంధం ఏమిటి ? మళ్ళీ అబద్ధాలాడేవు సుమా, జాగ్రత్త."

"ఆడిన అబద్ధాలు చాలు కాని, ఇంకా వాటి గొడవ ఎత్తకు. మా ఊరు ఇక్కడికి పదిమైళ్ళ దూరంలో ఉన్న కృష్ణాయపాలెం. కెప్టెన్ వివేకానందమూర్తి తాత గారిది కూడా మా ఊరేనని చెపుతారు. కాని వాళ్ళ తాలూకు ఎవేరూ ఇప్పుడు అక్కడ ఉండటంలేదనుకో! పోతే, మాఊళ్ళో మా ఇంటి పేరు కలవాళ్ళు చాలామంది ఉన్నారు. మా అమ్మా, నాన్న నా చిన్నప్పుడే చనిపోయారు. మా మేన మామే. నన్ను ఇప్పుడు చదివిస్తున్నాడు. కాని, ఆయనకి

కూడా నేనంటే అంత ప్రేమ లేదు. ఏదో విధిలేక, నలుగురు ఏమని పోతారోనని నన్ను ఈ మాత్రమయినా చదివిస్తున్నాడు. ఇక, అసలు సంగతి చెపుతాను. నేను గత సంవత్సరం మంగళగిరిలో చదివాను. అప్పుడే నేను దినపత్రికల్లో మొట్టమొదటిసారిగా కెప్టెన్ వివేకానందమూర్తి గారిని గూర్చి చదివాను. ఆయన ఫోటో కూడా చూశాను. నాకు వెంటనే ఓ ఆలోచన తట్టింది. నాకు 'నా' అన్నవాళ్లు ఎవ్వరూ లేరు. నన్ను ఆదరించేవాళ్లు, ప్రేమించేవాళ్లు అంతకన్నా లేరు. అటువంటప్పుడు కెప్టెన్‌గారివంటి అన్నయ్య ఒకడు ఉంటే ఎంత బావుంటుందోనని అనిపించింది. దానికి తోడు మా ఇద్దరి ఇంటి పేర్లు ఒకటి కావడం నాకు మరింత ప్రోత్సాహాన్ని ఇచ్చింది. ఇక, ఆ రోజునుంచి కెప్టెన్ వివేకానందమూర్తిగారి తమ్ముణ్ణి అంటూ చెప్పుకోవడం ప్రారంభించాను. మీలాగానే మంగళగిరి హైస్కూల్ కూడా అందరు నా మాటని నమ్మారు. నన్ను గౌరవించసాగారు. బహుశః నీకు ఈ సంగతులన్నీ వింటుంటే నవ్వు వస్తుందనుకుంటాను."

కాని, రాధాయి నవ్వడం లేదు. విజయసారథి చెప్పే విషయాలను జీర్ణం చేసుకోడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

"మరి, మీ అన్నయ్య దగ్గరనుంచి వచ్చిన ఉత్తరాల మాటేమిటి?" రాధాయి ప్రశ్నించాడు. "అవి కూడా నువ్వు తయారు చేసినవేనా?"

"ఆహాఁ, మనం తయారుచేసినవే! ఒక్కొక్క ఉత్తరం తయారు చేయడానికి ఎట్లా లేదన్నా మూడు, నాలుగు

రోజులు పట్టేది. ఉత్తరాలు తయారు చేయడమంటే మాట లనుకున్నా వేమిటి ?"

రాధాయి ఏమీ మాట్లాడలేదు. వాడి మనస్సు అక్కడలేదు. ఏదో ఆలోచిస్తూ అట్లాగే కూర్చుండిపోయాడు.

చల్లని గాలి తెరలకి పూలమొక్కలు మెల్లగా అటు ఇటు ఊగుతూ గుసగుసలాడుతున్నట్లున్నాయి. విద్యుద్దీపాల కాంతిలో పార్కు అంతా ప్రకాశవంతగాను, శోభాయమానం గాను ఉంది. దూరాన రేడియో ఏదో భావగీతాన్ని మధుర మధురంగా వినిపిస్తున్నది.

"ఊఁ, అంతా బాగానేఉంది కాని, మరి మాతో ఇన్ని అబద్ధాలు చెప్పి మమ్మల్ని ఇంతగా మోసంచేసినందుకు నీకు సిగ్గువేయడంలేదా.? ఏరా సారథీ." రాధాయి విజయసారథి కేసి సూటిగా చూస్తూ అన్నాడు.

"నువ్వు అట్లా అంటావని నాకు తెలుసు. కాని, అబ ద్ధాలు చెప్పి, మిమ్మల్ని నమ్మించి, తద్వారా ఏదో లాభాన్ని కాని, పేరునుకాని పొందాలని నేను ఆశించలేదు. నాకు అన్న లేని లోటును తీర్చుకుందామని అట్లాచేశాను. అందువల్ల నాకు ఒక విధంగా చాలా మంచి జరిగిందని అంగీకరిస్తాను. ఏమంటే, నేను నాచదువు పట్ల శ్రద్ధ వహించవలసి వచ్చింది. నా ప్రవర్తనను తగు విధంగా తీర్చి దిద్దుకోవలసిన అవసరం ఏర్పడింది. లేకపోతే మాఅన్నయ్యకి, కాదు, కాదు. కెప్టెన్ వివేకానందమూర్తి గారికి చెడ్డపేరు తెచ్చినవాణ్ని అవు తాను. అతని పేరు ప్రతిష్ఠలను తక్కువ చేసినవాణ్ని అవు

తాను. ఈ విషయం నిజమేనని నువ్వు కూడా ఒప్పుకుంటా వను కుంటాను."

రాధాయి అవునన్నట్లు తల త్రిప్పాడు.

"కాని, ఒక్కొక్కసారి నేను చేసిన పని తలుచుకుని నేనే సిగ్గు పడేవాణ్ని. ఏ రోజు ఎటువంటి ప్రమాదం వచ్చి పడుతుందోనని భయపడేవాణ్ని. అయినా నేను ఏం చేయ గలను చెప్పు? ఒకమాట అసలు అనకుండానే ఉండాలి. కాని, అన్న తర్వాత దాన్ని ఉపసంహరించుకోవడం మన చేతిలోని పని కాదు."

విజయ సారథి తరువాత ఏమీ మాట్లాడలేదు. తల పైకెత్తి మౌనంగా ఆకాశం కేసి చూస్తూ ఉండిపోయాడు.

రాధాయి విజయసారథి చెప్పిన మాటలను ఒక్కొక్క దాన్నే మననం చేయసాగాడు. సారథి ధైర్యం, సమయ స్ఫూర్తి, వాణ్ని చకితుణ్ని చేసింది. ఇంత పెద్ద అబద్ధాన్ని ఇన్ని రోజులుగా ఎంతో మందిచేత నమ్మిస్తున్న సారథి చాక చక్యాన్ని, తెలివి తేటలను చూసి వాడు విస్తుపోయాడు.

విజయసారథికి తల్లి దండ్రులు లేరు. ఆప్తులయినవాళ్లు అసలే లేరు. వాణ్ణి ప్రేమించి, లాలించి పెంచేవాళ్లు అంత కన్నా లేరు. అటువంటి ఏకాకి పరిస్థితిలో వాడు తనంతట తానుగా కెప్టెన్ వివేకానందమూర్తివంటి విమానవీరుడు తనకి అన్నయ్య అయితే ఎట్లా ఉంటుందోనని ఊహించుకుని మురిసి పోయాడు. ఎన్నో కలలు కన్నాడు. కాని, ఆ కలలు వట్టి కల్లలని, గాలిమేడలని, ఎండమావులని వాడికి తెలియకపోదు. అయితేమాత్రం ఏం? అతి కష్టపరిస్థితుల్లో కూడా ఆ కలలు

వాడికొక వెలుగు చూపించాయి. బాటను ఏర్పరచాయి. ఉత్సాహాన్ని కలిగించాయి. ముందుకి నడిపించాయి. కెప్టెన్ వివేకానందమూర్తి వాడికి మార్గదర్శకుడయ్యాడు. గురువు అయినాడు. ఆప్తుడు, మిత్రుడు, చివరికి అన్నయ్య అయినాడు. అటువంటప్పుడు విజయసారథి, కెప్టెన్ వివేకానందమూర్తిని తన అన్నయ్య అని చెప్పుకోవడంలో అసందర్భం ఏమీ లేదేమో? కెప్టెన్ వివేకానందమూర్తికి తమ్ముడుగా పుట్టకపోవడం వాడితప్పు కాదేమో? ఏమో! ఆ సంగతులన్నీ ఆ భగవానుడే నిర్ణయించాలి.

"అయితే ఇప్పుడు ఏంచేద్దామంటావు?" రాధాయి ప్రశ్నించాడు.

"నాకు ఏమీ తోచకుండా ఉందిరా రాధాయి," విజయసారథి విచారంగా అన్నాడు. "ఈ గొడవ ఇట్లాఉంటే, హెడ్మాష్టారు కెప్టెన్‌గారిపేర నా చదువుగురించి, ప్రవర్తన గురించి ఓ ఉత్తరం వ్రాశారు. నాకు అంతా అయోమయంగా ఉంది. ఎక్కడికయినా దూర ప్రాంతానికి వెళ్ళిపోదామని ఉంది. మన బడిలోవాళ్ళందరికీ ఈ విషయాలన్నీ తెలిస్తే నన్ను బ్రతుకనిస్తారా? నా జీవితాంతం నన్ను వెక్కిరిస్తారు. ఏడిపించుకు తింటారు. నేను ఇటువంటి అవమానాన్ని మట్టుకు చచ్చినా భరించలేను."

"అందుకని ఎక్కడికయినా పారిపోతానంటావు, అవునా? ఎక్కడికి పారిపోతావో ముందు చెప్పు." రాధాయి మందలింపుగా అన్నాడు. "నువ్వు కెప్టెన్ గారి తమ్ముడివని చెప్పుకున్నందుకు అయినా వారిలోని ధైర్య సాహసాలను

కొంతగాకపోతే కొంతయినా ప్రదర్శించు. అధైర్యపడి, పిరికి వాడి వలె పారిపోతే ప్రయోజనం ఏమిటి చెప్పు? కనుక, నా మాటవిని వెంటనే కేప్టెన్ గారు ఉంటున్న రహదారి బంగాళాకు వెళ్ళి, వారితో జరిగిన విషయమంతా పూర్తిగా చెప్పు. వారు తప్పక నిన్ను క్షమిస్తారని ఆశిస్తాను."

"ఏమిటి? నన్ను ఒంటరిగా ఆయన దగ్గిరికి వెళ్ళ మంటావా? నాకేదో భయంగా ఉందిరా రాధాయి" విజయ సారథి దిగులుగా అన్నాడు.

"నాకు ఇంకో ఆలోచన వచ్చింది. కాని. జాగ్రత్తగా విను. నేనే మొట్ట మొదట వెళ్ళివారితో విషయమంతా సవిస్తరంగా చెపుతాను. తరువాత నువ్వు వెళ్ళి మిగతా సంగతులు ఏమన్నా ఉంటే చెప్పవచ్చు. ఏమంటావు?"

"నిజంగానా రాధాయి!" విజయ సారథి ఆశ్చర్యంగా అన్నాడు. ఈ పని కనుక చేసావంటే నీ మేలు ఎన్నటికీ మరువలేను."

"నేను వీలుంటే రేపు ప్రొద్దుటే ఆయన దగ్గిరికి వెడ తాను. ఇందాక స్టేషన్ వద్ద స్వాగత మిచ్చిన వారిలో నేను కూడా ఉన్నాను కాబట్టి నన్ను ఆయన అంత త్వరగా మరిచి పోయి ఉండరు. ఏమంటావు? ఆయనతో మాట్లాడి నీకు ఏ సంగతి రేపు సాయంకాలం చెపుతాను."

"అట్లాగే! రేపు ప్రొద్దున వెళ్ళడం మరచిపోవుకదూ! ఇక, నేను వెడతాను"

"ఈవేళ అప్పుడు ఎక్కడికి వెడతావురా? పోనీ, మా ఇంటికి రాకూడదూ?" రాధాయి అన్నాడు.

"మీ ఇంటికి వద్దు. మనం ఇద్దరం కలిపి వెళ్ళడం ఎవ రయినా చూశారంటే నీకు, నాకు ఇబ్బంది అవుతుంది. ఈ ఊళ్లోనే, గవర్నరుపేటలో నాకు తెలిసిన వాళ్ళు వున్నారు. వాళ్ళ ఇంటికి వెడతాను."

"నీ ఇష్టం."

"రేపు సరీగా ఎనిమిది గంటలకి తిరిగి ఇక్కడే కలుసు కుందాం. ఊఁ, ఇక నేను వెడుతున్నాను రాధాయి."

తరువాత విజయ సారథి మెల్లగా గవర్నరుపేట కేసి నడిచాడు.

# 11

"దయచేసి లోపలికి రండి!" తన గదితలుపు తట్టిన చప్పుడయితే కెప్టెన్ వివేకానందమూర్తి మెల్లగా మర్యాద పూర్వకంగా అన్నాడు.

ఉదయం ఆరున్నర గంటలనుంచి అతను ఆ విధంగా ఎన్నిసార్లు అన్నాడో లెక్కలేదు. ఎందరిని ఆహ్వానించాడో, ఎంతమందితో మాట్లాడాడో, అంతులేదు. అతన్ని చూడ టానికి వచ్చిన వారిలో—పురప్రముఖులు, పత్రికావిలేఖరులు విద్యార్థులు, విమాన దళంలో చేరాలనే వుత్సాహవంతులు; సారస్వత ప్రియులు, సంతకాలు సేకరించేవాళ్లు — ఒక రేమిటి? అన్నిరకాల వ్యక్తులు వున్నారు. కెప్టెన్ వివేకానంద మూర్తి వారందరు చెప్పేవి శ్రద్ధగా వినేవారు. వారికి తగు సలహాలు, సూచనలు ఇచ్చేవారు. వారి కోర్కెలను సాధ్య మయినంత వరకు తీర్చి, వారిని సంతృప్తి పరిచి పంపేవారు.

కెప్టెన్ వివేకానందమూర్తి వద్ద అటువంటి ఓర్పు, నేర్పువుంది. ఆ విధమయిన ఊపిరి సలుపని కార్యక్రమంలో పాల్గొనే సామర్థ్యం వుంది.

"దయచేసి లోపలికి రండి!" కెప్టెన్ వివేకానందమూర్తి తిరిగి అన్నాడు. "తలుపు తీసేఉన్నది."

గదిబయట ఎవరో కదులుతున్న చప్పుడయితే విని పిస్తున్నది కాని, లోపలికిమాత్రం ఎవ్వరూ రాలేదు. కెప్టెన్ వివేకానందమూర్తి ఓ క్షణంసేపు ఊరుకుని, తరువాత మెల్లగా వెళ్ళి తలుపు తీశాడు. గుమ్మంవద్దనే నిలబడి ఉన్న రాధాయి అతనికి కనిపించాడు. తెలుపురంగు పొడుగుచొక్కా, అదే రంగు పొడుగులాగు తొడుక్కుని ముచ్చటగావున్న రాధాయిని తేరిపార చూస్తూ అతను ఆప్యాయంగా అన్నాడు:

"లోపలికి రావోయ్! బయట నిలుచున్నావేం? నిన్ను ఎక్కడో చూసినట్లు వున్నదే! ఆఁ, జ్ఞాపకం వచ్చింది. నిన్న స్టేషన్‌దగ్గిరికి నువ్వుకూడా వచ్చావుకదూ? అయితే. మన ఇద్దరం పాతస్నేహితుల మన్నమాట. ఊఁ, అట్లా వచ్చి ఆ కుర్చీలో కూచో!"

రాధాయి బిక్కుబిక్కుమంటూ వెళ్ళి కెప్టెన్ వివేకానందమూర్తికి ఎదురుగా వున్న కుర్చీలో కూచున్నాడు.

"ఇంతకీ నువ్వువచ్చిన పని ఏమిటో చెప్పలేదు. ఊరికే మళ్ళీ ఓసారి నన్ను చూసిపోదామని వచ్చావా?" అతను ప్రశ్నించాడు.

ఇంతలో టెలిఫోన్ గణగణ మ్రోగింది. అతను రిసీవర్‌ను అందుకున్నాడు.

"హల్లో! అప్రను ... నేనే ... కెప్టెన్ వివేకానంద మూర్తిని మాట్లాడుతున్నాను. ఆఁ...ఆఁ...అట్లాగే రండి. త్వరగా వస్తారుకదూ! నాకు అవతల చాలాపనులు వున్నాయి. కొద్దిసేపట్లోనే బయటికి వెళ్లాలి. ఓ...మీకోసం ఎదురు చూస్తుంటాను...మంచిది."

అతను వెంటనే తన గడియారంకేసి చూశాడు. అందరు విమానచోదకులవలెనే అతనుకూడా తన గడియారాన్ని మనికట్టు లోపలివైపున కట్టుకున్నాడు. అందువల్ల ఉపయోగ మేమంటే, విమానం నడుపుతున్నప్పుడు స్టీరింగ్ వీల్ మీదనుంచి చెయ్యి తియ్యకుండానే టైము చూసుకోవచ్చు.

రాధాయి మాట్లాడుదామని ప్రయత్నించాడు. కాని, నోట మాట పెగిలిరాలేదు. కాళ్లు, చేతులు చలిజ్వరం వచ్చినవాడికి మల్లే గజగజ వణుక నారంభించాయి. వాడిలో అయిదు నిమిషాల క్రితం ఉన్న ఉత్సాహం, ధైర్యం ఇప్పుడు లేవు. విజయసారథి సంగతి కెప్టెన్ వివేకానందమూర్తితో చెప్పి, అతని అభిప్రాయం ఏమిటో తెలుసుకుందామని వచ్చాడు. "వివేకానందమూర్తిగారూ, మా తరగతిలోని ఓ పిల్లవాడు మీరు వాడికి అన్నయ్య అవుతారని చెప్పి మమ్మల్ని మాస్టార్లను, ఆఖరికి హెడ్మాస్టారినికూడా నమ్మించాడు. కాని, నిజానికి మీరు వాడికి అన్నయ్యకారు. ఆలెక్కకి వస్తే ఒక్క ఇంటిపేరులో మినహా మీకు, వాడికి ఎట్టి సంబంధం లేదు. అటువంటి పరిస్థితిలో మీరు ఇక్కడికిరావడం వాడికి భయాన్ని కలిగించింది. ఏమంటే, వాడు ఎన్నాళ్ళనుంచో జాగ్రత్తగా కాపాడుకువస్తున్న రహస్యం కాస్తా బయటపడే అవకాశం

ఉంది. మీతో ఆ సంగతులన్నీ మాట్లాడటానికి, తన తప్పు ఒప్పుకోవడానికి, మిమ్మల్ని క్షమించమని కోరడానికి వాడికి ధైర్యం చాలడం లేదు. అందువల్ల వాడితరఫున నేను వచ్చాను. నీట ముంచినా, పాలముంచినా – భారం మీదే!" అని కెప్టెన్ వివేకానందమూర్తితో చెప్పాలనుకున్నాడు రాధాయి. కాని, తీరా ఆయన ఎదుటపడేసరికి ఒక్కమాటా చెప్పడానికి ధైర్యం లేకుండా ఉంది.

కెప్టెన్ వివేకానందమూర్తి కుర్చీలోంచి లేచి మెల్లగా పచార్లు చెయ్యడం ప్రారంభించాడు. అతని నడకలో రాధాయికి ఒక ప్రత్యేకత కనిపించింది. ఆరడుగులకు మించి ఉన్న అతని ఆజానుబాహు విగ్రహం గదిలో అటు ఇటు కదులుతుంటే వాడికి చూడ ముచ్చటవేసింది. దానికితోడు అతని సైనికదుస్తులు, పతకాలు మరింత ఆకర్షణీయంగా ఉండి, మాటిమాటికి చూడాలనే ఉత్కంఠను కలగిస్తున్నాయి.

ఆవిధంగా మరో రెండునిమిషాలు గడిచాయి. ఇంకా ఆలస్యంచేయడం అంత మంచిపని కాదనుకున్నాడు రాధాయి. కాని, వాడికి ధైర్యం చాలడంలేదు. తీరా చెపితే కెప్టెన్ వివేకానందమూర్తి కోపగించుకుని, "ఏమిటి నువ్వు మాట్లాడుతున్నది? ఈ పిచ్చికథ చెప్పడానికి ఇంత శ్రమపడి వచ్చావన్నమాట. ఎవడో తెలిసి, తెలియని వెధవ నేను వాడి అన్నయ్యనని చెప్పి మిమల్ని నమ్మించాడనే అనుకుందాం. ఆసంగతి నాకు చెప్పడంవల్ల కలిగే ప్రయోజనం ఏమిటి? నాకు అంతకంటే చాలా ముఖ్యమయిన పనులు ఉన్నాయి

కాని, దయచేసి వెంటనే బయటికి నడు..." అని అంటే ఏమిటి గతి ?

"నీపేరేమిటి తమ్ముడూ ?" కెప్టెన్ వివేకానందమూర్తి రాధాయిదగ్గిరికి వచ్చి ప్రేమగా అన్నాడు.

"రాధాకృష్ణమూర్తి. కాని నన్ను అందరు 'రాధాయి' అని పిలుస్తారండీ."

"బావుంది. సరే, ఇంతకీ నువ్వు వచ్చిన పనేమిటో చెప్పనే లేదు..."

"ఏమీ...ఏమీలేదండి. మరే...మరే..."రాధాయి తన శక్తినంతా ఉపయోగించి మాట్లాడటానికి ప్రయత్నించాడు. కాని, అబ్బే! ఒక్క మాటయినా ఊడిపడితేనా ? అసలుసంగతి చెపుదా మనుకునేసరికి గొంతు పట్టుకుంటున్నట్లుగా ఉండేది.

"అంత భయమెందుకోయ్ పిచ్చివాడా! చెప్పదలచుకున్న దేమిటో సూటిగా చెప్పు."

"మరే...మీ తరగతిలో...అహఁ, కాదు...మా తరగతిలో మీ తమ్ముణ్ణని ఓ పిల్లవాడు..."

ఊఁహూఁ, నువ్వు లాభం లేదోయ్! ఒక్తి పిరికి అబ్బాయివి. నీ టెలిగ్రాం భాష నాకు ఏ మాత్రం అర్థం కావడం లేదు." కెప్టెన్ వివేకానందమూర్తి నవ్వుతూ అన్నాడు.

ఇంతలో ఎవరో గది తలుపు తట్టారు.

"దయచేసి లోపలికి రండి!" కెప్టెన్ వివేకానందమూర్తి తన సహజ ధోరణిలో అన్నాడు.

ఆ మాటలు అతను అన్నాడో లేదో, ఓ వృద్ధురాలు తలుపు తీసుకుని లోన ప్రవేశించింది. ఆమె వాలకం చూస్తే మర్యాద, మన్నన తెలిసిన మనిషిలా కనిపిస్తున్నది. ఆమె ఎర్రని పట్టుచీరె కట్టుకున్నది. చేతిలో ఆకుపచ్చ రంగుకల చిన్న సంచీ పట్టుకున్నది.

"మీ సంభాషణకి అంతరాయం కలిగించినందుకు క్షమించండి." ఆ వృద్ధురాలు ఎంతో వినయంగా అన్నది. "మిమ్మల్ని చూడాలనే ఆసక్తితో వచ్చాను నాయనా! మీ గురించి పత్రికల్లో చదివాను. మీరు భారతదేశంలోని విమానచోదకులందరిలోకి సమర్థులని నా నమ్మకం."

కెప్టెన్ వివేకానందమూర్తి ఆ వృద్ధురాలిని కూచోమని చెప్పి, ఒక పడకకుర్చీ చూపించాడు. కాని, ఆమె కూచోలేదు. కెప్టెన్ వివేకానందమూర్తి దగ్గిరికి వెళ్ళి అతని ముఖాన్ని నిశితంగా పరిశీలిస్తూ ఊరికే విసుగు విరామం లేకుండా కబుర్లు చెపుతున్నది.

"నీకోసం ఊలుతో ఓ చక్కని టోపీ అల్లాను నాయనా! నీ చిన్నప్పుడు నీకు ఇటువంటి టోపీలు ఎన్ని అల్లానో లెక్కలేదు. అయితే నీకు మీ పార్వతమ్మ పెద్దమ్మ జ్ఞాపకంలేదా? నేనే ఆ పార్వతమ్మ పెద్దమ్మని."

"జ్ఞాపకంలేదమ్మా. మరిచిపోయాను." కెప్టెన్ వివేకానందమూర్తి అన్నాడు,

"ఏమిటి, మీ పార్వతమ్మ పెద్దమ్మని మరిచిపోయానంటున్నావా! అట్లా ఎన్నటికి జరగడానికి వీల్లేదు. నీ చిన్నప్పుడు మీ పార్వతమ్మ పెద్దమ్మని వదిలిపెట్టి ఒక్క క్షణ

మయినా ఉన్నావా? మీ తాత, రఘురామయ్యగారు — పాపం, ఇప్పుడు చచ్చి స్వర్గాన ఉన్నాడు — ఆయన నిన్ను చూసి ఎంత మురుసుకుంటుండేవాడు? ఏమిటో నాయనా, ఆ రోజులు మళ్ళీ తిరిగిరావు."

"పార్వతమ్మ పెద్దమ్మగారూ, ఒక్క సంగతి. మా తాత గారి పేరు రఘురామయ్య కాదు, ఆయన పేరు వెంకట కృష్ణయ్య."

"అయితే, మీ తాతగారి ఊరు అమరావతి కదూ?"

"కాదు. కృష్ణాయపాలెం."

"అయితే, నేను పొరపాటు పడ్డానన్నమాట" పార్వతమ్మ పెద్దమ్మ నొచ్చుకుంటూ అన్నది. "ఏదో పెద్దదాన్ని అయినాను కదూ. రానురాను జ్ఞాపకశక్తి తగ్గిపోతున్నది. మీ ఇంటిపేరు కలవాళ్లు అమరావతిలో కూడా ఉన్నారు నాయనా. మీ తాతగారిఊరు కృష్ణాయపాలెం అని చెప్పావు కదూ? అంతేలే, ఏ ఊరు అయితేనేం? ఇవాళ చాలా మంచిరోజు. నీవంటి విమానవీరుణ్ణి చూడకలిగాను. నాకు ఎంతో సంతోషంగా ఉంది." ఆ వృద్ధురాలు ఓ క్షణంసేపు మౌనంగా ఉండి, తరువాత మెల్లగాఅన్నది: "ఇదిగోనాయనా నీ టోపీ! నీకోసం ప్రత్యేకంగా అల్లాను. నీవు పెట్టుకుంటే ఎంతో బావుంటుంది. నిజంగా నాయనా..."

తరువాత ఆ వృద్ధురాలు ఓసారి కెప్టెన్ వివేకానంద మూర్తి వీపుతట్టి వెళ్ళిపోయింది.

"మా బడిలోకూడా ఇటువంటి అతిసోది పిల్లవాడు ఒకడు ఉన్నాడు. వాడేమో..." రాధాయి మొదలుపెట్టాడు.

ఇంతలో తిరిగి టెలిఫోన్ మ్రోగింది. కెప్టెన్ వివేకా నందమూర్తి ఫోనులో మాట్లాడటం ముగించి రిసీవర్ క్రింద పెట్టేసరికి ఎవరో తలుపు తట్టారు.

ఈ సారి గదిలోకి ఒక యువక శాస్త్ర పరిశోధకుడు ప్రవేశించాడు. అతను వచ్చీరావడంతోటే తన పరిశోధలను గూర్చి ఒకటేమయిన చెప్పడం ప్రారంభించాడు. తనొక వినూత్న విషయాన్ని కనుకున్నానని, దానివల్ల ప్రస్తుతం ఉన్న విమాన నిర్మాణ విధానమే పూర్తిగా తల క్రిందులై పోతుందని ఆ యువక శాస్త్ర పరిశోధకుడు సగర్వంగా చెప్పాడు.

"ఈ నాడు అమలులో ఉన్న విమాన నిర్మాణ విధానాన్ని తల క్రిందులు చేయాలనే అలోచనలు అసలు మీకు ఎందుకు వచ్చినట్టు ?" ఆ యువక శాస్త్రపరిశోధకుడు చెప్పిన దంతా శ్రద్ధగా విన్నమీదట కెప్టెన్ వివేకానంద మూర్తి అన్నాడు. "ఇప్పటి విమాన నిర్మాణ విధానం లోపం భూయిష్టంగా ఉన్నదనా ?" లేకపోతే మరేమయినా ఇతర కారణాలు ఉన్నయా ?"

ఆ యువక శాస్త్రవేత్త అందుకు సరి అయిన సమాధానం చెప్పలేదు.

"ఒక్క సంగతి. మీరింకా యువకులు, వృద్ధిలోకి రావలసినవారు, కాబట్టి తొందరపడి ఏ నిర్ణయానికి రాకండి. ముందు విమాన నిర్మాణానికి సంబంధించిన అన్ని విషయాలను క్షుణ్ణంగా తెలుసుకుని, అటు పిమ్మట పరిశోధన ప్రారంభించండి. అప్పుడు మీ పరిశోధనవల్ల దేశానికి ఎంతయినా

ఉపకారం ఉంటుంది. మీరు నా సలహాను సానుభూతి పూర్వకంగా పరిశీలిస్తారని ఆశిస్తాను."

ఆ తరువాత కెప్టెన్ వివేకానందమూర్తిని చూడటానికి గాను ఇద్దరు పురపాలక సభ్యులు వచ్చారు. వారు కొంచెం సేపు ఆ విషయాలు, ఈ విషయాలు మాట్లాడి వెళ్ళి పోయారు.

రాధాయి ఇక తన కథ ప్రారంభిద్దామని నోరు తెరి చాడో, లేదో బయట ఎవరో తలుపు తట్టిన చప్పుడయింది. మరు క్షణంలో ఓ వృద్ధ వైద్యుడు గదిలో ప్రత్యక్షమయి నాడు. ఆయన కేవలం వైద్యుడే కాదు. శాస్త్ర సాహిత్య ప్రియుడు కూడా! అన్నిటిని మించి ప్రసిద్ధులయిన వాళ్ళ సంతకాలు సేకరించడమంటే ఆయనకి మహా సరదా కాదు, కాదు——మహా పిచ్చి.

ఆయన వచ్చిన దగ్గిరనుంచి మాటల మధ్యలో ప్రఖ్యాత కవుల, వేదాంతుల సుభాషితాలను ధారాళంగా దొర్లించసాగాడు. ఆ వృద్ధవైద్యుని మాటలు కాసేపు విన్నా మంటే మనకి విసుగుమాట అటుంచి ముందు నిద్ర ముంచుకు వస్తుంది.

నశ్వము పీల్చని వాడును.
అశ్వంబును సంగరమున ఎక్కని వాడున్..."

"ఆఁ ... ఇంకా ఏదో ఉంది కాని సరిగా జ్ఞాపకం రా వడం లేదు. అటు వంటి వాళ్ళు ఒక వీరులేనా అంటూ ఓ కవి చక్రవర్తి ఈసడించి పారేశాడు. ఆ విధంగానే ఈ

కాలంలో విమానం నడపటం చేతకాని వాడూ ఒక మని షేనా అని నా ప్రశ్న ! ఏమంటారు మహాశయా ?”

కెప్టెన్ వివేకానందమూర్తి ఏమీ అనలేదు. ఒక్క చిరునవ్వు మాత్రం నవ్వి ఊరుకున్నాడు.

తరువాత ఆ వృద్ధ వైద్యుడు వివేకానందమూర్తిని తన సంతకాల పుస్తకంలో సంతకం చెయ్యమన్నాడు. వివేకానంద మూర్తి వెంటనే ఆ పుస్తకంలో సంతక చేశాడు.

ఆ వృద్ధ వైద్యుడు వెడదామని వెనక్కి తిరిగి గుమ్మం దాకా వెళ్లాడు. కాని, అక్కడికి వెళ్ళిన తర్వాత ఏంగుబులు పుట్టిందో, ఏమో వెంటనే తిరిగి కెప్టెన్ వివేకానందమూర్తి దగ్గిరికి వచ్చి, అతని కేసి పరిశీలనగా చూస్తూ అన్నాడు :

“ఏం కెప్టెన్ మహాశయా ! మీ ఆరోగ్యం ఎట్లాఉంది? మొత్తానికి కులాసాగా ఉన్నట్లు కనిపిస్తున్నా రనుకోండి. పోతే, మీ గుండెమాటేమిటి ? ఎట్టిబాధ లేకుండా చక్కగా పని చేస్తున్నదా ? అయినా మీకు గుండెనిగురించి ఆలోచించ డానికి తీరిక ఎక్కడ ఉందిలెండి. ఇట్లా అంటున్నందుకు ఈ వృద్ధవైద్యుణ్ణి గూర్చి అన్యథా తలంచకండి. వైద్యుడుగా, గుండెకి సంబంధించిన అన్ని విషయాలలోను ప్రవీణుడుగా మీతో మాట్లాడటానికి నాకు అధికారం ఉంది. సరే, ఆ విషయాన్ని విడిచిపెడదాం. ఏదీ, ఓసారి మీ నాడిని చూడ నివ్వండి. అబ్బే, మీరు నన్ను అడ్డుపెట్టి లాభంలేదు. మీ ఆరోగ్యం విషయం మేమందరం పట్టించుకోవాలి. ఏమంటే, మీరు మా అందరికి — కాదు, కాదు — దేశానికి సంబంధిం చిన వ్యక్తి కాబట్టి. మీరు ఎల్లప్పుడు ఆరోగ్యంగా ఉండటం

దేశానికి ఎంతైనా అవసరం. ఊఁ...ఊఁ...మీనాడి బాగానే ఉంది."

ఆ వృద్ధవైద్యుడు కెప్టెన్ వివేకానందమూర్తికి కనీసం నోరు తెరవడానికైనా అవకాశం ఇవ్వలేదు. ఆరోగ్యాన్ని గూర్చి, దాన్ని జాగ్రత్తగా కాపాడుకునే విధానాన్ని గూర్చి ఊరికే చెప్పుకుపోతున్నాడు. అట్లా మాట్లాడుతూనే ఆ వృద్ధ వైద్యుడు హఠాత్తుగా తన జేబులోంచి ఓ స్టెతస్కోప్ తీసి, దాని రెండుకొసలు తన చెవులకి తగిలించుకుని, ఓ గుండ్రని బిళ్ళవంటిదాన్ని కెప్టెన్ వివేకానందమూర్తి గుండెమీద పెట్టి పరీక్షించసాగాడు. ఆవిధంగా ఓ క్షణం గడిచిన తర్వాత ఏమనుకున్నాడో ఏమో, ఆ వృద్ధ వైద్యుడు అతి చొరవగా అతి సులువుగా, వివేకానందమూర్తి కోటు గుండీలు ఊడదీసి, తన స్టెతస్కోప్‌ను అతని గుండెమీద ఉంచి శ్రద్ధగా పరీక్షించసాగాడు.

"ఓ సారి గట్టిగా గాలి పీల్చండి," ఆ వృద్ధ వైద్యుడు అన్నాడు.

"అది కాదు స్వామీ, ఈ హడావిడి అంతా ఏమిటి ? నేను చాలా ఆరోగ్యంగానే ఉన్నాను." వివేకానందమూర్తి అన్నాడు.

"ప్రతివాళ్లు తీరా రోగం వచ్చిందాకా అట్లాగే అనుకుంటారు. ఇటువంటి ముచ్చటలు నేను ఎన్నోసార్లు విన్నాను. దయచేసి మారుమాటాడక నేను చెప్పినట్లు చెయ్యండి. ఏదీ, ఓ సారి గట్టిగా ఊపిరిపీల్చండి."

కెప్టెన్ వివేకానందమూర్తి ఆ వృద్ధవైద్యుడు చెప్పినట్లు గానే బుద్ధిమంతుడిలా ఓసారి గట్టిగా గాలి పీల్చాడు. అతని విశాలమయిన వక్షస్థలం ఓమారు పైకిలేచి తిరిగి మామూలుగా అయింది.

"బావుంది, బావుంది. ఏదీ, మళ్ళీ ఓసారి ఊపిరి పీల్చండి. అదీ, అట్లా! ఊఁ...అరె, ఈవైపు పైమూలదగ్గిర ఇటువంటి ధ్వని వస్తున్నదేమిటి?"

"అక్కడ నాకు దెబ్బతగిలింది" వివేకానందమూర్తి అన్నాడు.

"ఏమిటి? మీకు ఇటువంటి సున్నితమయిన చోట దెబ్బతగిలిందా? ఎంత ప్రమాదం, ఎంతప్రమాదం! అయితే, మీరు ఈ విషయాన్ని గూర్చి ఇంకా ఎంతమాత్రం అశ్రద్ధ చేయడానికి వీల్లేదు. మీరు వెంటనే ఏపెద్ద వైద్యుడిదగ్గిరికైనా వెళ్ళి తగిన చికిత్స చేయించుకోండి. గుండె ఆమూలనుంచి అటువంటి ధ్వని రావడం అంత మంచి లక్షణం కాదు. ఏం, కెప్టెన్ మహాశయా! నేను చెప్పేదంతా జాగ్రత్తగా వింటున్నారు కదూ. నేను చెప్పినట్లు తప్పక చేయండి. ఇది విజ్ఞప్తి కాదు, ఆజ్ఞ."

ఆ వృద్ధవైద్యుడు కెప్టెన్ వివేకానందమూర్తివద్ద సెలవు తీసుకుని గుమ్మందాకా వెళ్ళి మళ్ళీ తిరిగి వెనక్కి వచ్చాడు.

"ఆఁ...ఇంకో సంగతి మరిచాను. మద్రాసులో కె. నరసింహారావుగారనే ఒక ప్రసిద్ధ వైద్యుడు ఉన్నాడు. ఆయన గుండెజబ్బుల విషయంలో ప్రవీణుడు. విదేశాలకి కూడా వెళ్ళి

వచ్చినట్లు జ్ఞాపకం. మీరు ఆయనదగ్గిరికి వెడితే మంచిది. ఇక వస్తానండి! సెలవు."

"అట్లాగే డాక్టర్ ! మీరు చెప్పినట్లు చేస్తాను" అంటూ కెప్టెన్ వివేకానందమూర్తి తన డైరీలో ఏదో వ్రాసుకున్నాడు.

ఆ వృద్ధవైద్యుడు అట్లా బయటికి వెళ్లాడో, లేదో రాధాయి తన కథ మొదలుపెట్టడానికి సిద్ధమయ్యాడు. కాని, అవకాశం దొరికితేనా ? ఇంతలో గది తలుపు తీసుకుని శ్రీనివాసరావు వచ్చాడు. వాణ్ణి చూడగానే రాధాయికి ఎక్కడలేని నీరసం వచ్చింది. ఏమంటే, వాడిముందు తను విజయసారథిని గూర్చి చెప్పడానికి ఎంతమాత్రం వీల్లేదు. రాధాయిని చూడగానే శ్రీనివాసరావుకూడా తెల్లముఖం వేశాడు. వాడు అక్కడికి ఎందుకు వచ్చాడో అనే ఆలోచనలో పడ్డాడు శ్రీనివాసరావు.

"లోపలికి రావోయ్ !" కెప్టెన్ వివేకానందమూర్తి శ్రీనివాసరావుని ఆహ్వానించాడు. "ఈ అబ్బాయి ఎవరో నీకు తెలుసా ?"

"తెలుసండి, అయిదవఫారం విద్యార్థి. హాకీ ఆటలో మా ప్రత్యర్థి."

"అట్లాగా. అయితే, మీరందరు మంచి హాకీ ఆటగాళ్ళన్నమాట."

"మాకు, అయిదవఫారంవాళ్ళ జట్టుకు రేపు సాయంకాలం పెద్ద పోటీ జరగబోతున్నదండి. మీరు తప్పక రావాలి. మీకు హాకీఆట అంటే చాలా ఇష్టమని పత్రికల్లో చదివాను." శ్రీనివాసరావు అన్నాడు.

"నిజమే. నేనుకూడా కొద్దిగా ఆడతాను. ఏమైనా మీఅంత బాగా ఆడ లేననుకో!" వివేకానందమూర్తి నవ్వుతూ అన్నాడు.

"మాదంతా చిన్నపిల్లలాట. రేపు మీరు తప్పకుండా రావాలి. సాయంకాలం మూడుగంటలకు పోటీ ప్రారంభ మవుతుంది. మీరు తప్పక వస్తారుకదూ!" శ్రీనివాసరావు అన్నాడు,

"ఏమోయ్ రాధాకృష్ణమూర్తీ, మీ జట్టులో నువ్వు కూడా ఉన్నావా?" వివేకానందమూర్తి ప్రశ్నించాడు.

"ఉన్నానండి" రాధాయి తల వంచుకుని మెల్లగా అన్నాడు. "మాజట్టు ఎట్లా ఆడేదీ రేపు మీరే చూస్తారుగా!"

"ఓ, తప్పకుండా చూస్తాను. సాయంకాలం మూడు గంటలకి కదూ పోటీ? అట్లాగే వస్తాను."

తరువాత కెప్టెన్ వివేకానందమూర్తినుంచి సెలవుతీసు కుని రాధాయి, శ్రీనివాసరావు మెల్లగా ఇళ్ళకి బయల్దేరారు.

# 12

అనుకున్న ప్రకారంగా విజయసారథిని కలుసుకోడా నికి గాను రాధాయి ఆ రాత్రి ఎనిమిది గంటలకి పార్కుకి వెళ్లాడు. అప్పటికే విజయసారథి వచ్చి వాడికోసం ఎదురు చూస్తూ కూచున్నాడు. రాధాయి కనిపించగానే ఆత్రంగా అన్నాడు:

"ఏరా రాధాయి, కెప్టెన్‌గారు ఏమన్నారు? నన్ను కోప్పడ్డారా, లేకపోతే..."

"నువ్వు ఏమీ అనుకోకుండా ఉంటే ఒక్క సంగతి చెప్తాను" రాధాయి సారథి బుజంమీద చేయివేసి నెమ్మదిగా అన్నాడు. "నేను నీసంగతి కెప్టెన్ గారితో మాట్లాడనేలేదు."

"ఎందుకని ?" విజయసారథి తీవ్రంగా అన్నాడు.

"ఎందుకనంటే ఏంచెప్పేది ? నేను వెళ్ళి తీరా ఈ విషయం ప్రస్తావించబోయేసరికి ఓ ముసలమ్మ వచ్చి ఏవో పిచ్చికబుర్లు చెప్పి, కెప్టెన్ గారికి ఓ ఊలుటోపీ బహుమానంగా ఇచ్చి చక్కాపోయింది. ఆమెగారు అట్లా వెళ్ళిందో, లేదో ఓ బండెడు కాగితాలు, బొమ్మలు తీసుకుని ఒక యువక శాస్త్రవేత్త ప్రత్యక్షమయ్యాడు. ఆయనతో ఓ అరగంట సరిపోయింది. ఇదే సమయమని నేను ఈ సంగతి చెప్పడానికి నోరు తెరవగానే యమకింకరుడిలా ఓ వృద్ధ వైద్య మహాశయుడు వచ్చాడు. ఇక చూడు, ఆయన మాట్లాడిన మాటలు, చేసిన చేష్టలు చెప్పాలంటే ఓపూట పడుతుంది. ఆఁ, మరిచి పోయానురోయ్, ఈయనగారికి ముందు మరో ఇద్దరు పెద్ద మనుష్యులు వచ్చి వెళ్లారు సరే, ఆ ముసలివైద్యుడు వెళ్ళి పోయాడుకదా, ఇక హాయిగా మన సంగతి చెప్పవచ్చని అనుకుంటుండగానే శ్రీనివాసరావుగాడు ఉన్నట్లుండి ఎక్కడి నుంచో హఠాత్తుగా ఊడిపడ్డాడు. వాడు కెప్టెన్ గారిని రేపు జరుగబోయే పోటీ చూడటానికి రమ్మని ఆహ్వానించాడు. ఆయన తప్పక వస్తానని చెప్పారు. ఆ తరువాత వివేకానంద మూర్తిగారు ఏదో ముఖ్యమయిన పనిమీద బయటికి వెళ్ళ వలసి వచ్చింది. ఇక నేనేంచేస్తాను చెప్పు ? అందులో శ్రీని

వాసరావుకూడా ప్రక్కనే ఉన్నాడాయె! అందుకని వివేకా నందమూర్తిగారినుంచి సెలవు తీసుకుని బయటపడ్డాను.”

“ఏడవలేక పోయావు!” విజయ సారథి కోపంగా అన్నాడు. “ఈమాత్రందానికేనా నిన్న అంత గొప్పలు చెప్పావు? ‘నీతరపున అన్నివిషయాలు చెప్తాను, నువ్వేం భయపడకు’ అంటూ నన్ను జోకొట్టి వెళ్ళి ఈ ఘనకార్య మన్నమాట నువ్వు చేసేది! బావుంది. స్నేహితుడివయినం దుకు మంచిపనే చేశావు, సెలవు” అంటూ రాధాయి పిలు స్తున్నా వినిపించుకోకుండా విజయసారథి విసురుగా వెళ్ళి పోయాడు.

“విజయసారథీ, విజయసారథీ, రేపటి మన పోటీమాట ఏమిటి? నువ్వు లేనిది మన జట్టు చచ్చినా గెలవదు. రేపు సాయంకాలం మూడు గంటలకి పోటీ ప్రారంభమవుతుంది.” రాధాయి పెద్దగా అన్నాడు.

కాని, విజయ సారథి వాడి మాటలనేమీ లెక్క చెయ్యకుండా తన దారిన తను వెళ్ళాడు.

“పెద్ద చిక్కే వచ్చి పడిందే!” విజయ సారథి తనలో తాను అనుకున్నాడు. “రేపు కనుక పోటీకి వెళ్లానంటే రహస్యం కాస్తా తప్పక బయట పడుతుంది. పెద్ద అవమానం జరుగుతుంది. పోనీ, పోటీకి వెళ్ళకుండా ఊరుకుందామంటే— అదీ అంత మంచిపనిగా తోచడంలేదు. ఏమంటే, జట్టు నాయ కుడు లేకుండా తన జట్టువాళ్లు ఎట్లాగూ సరిగా ఆడలేరు. తన జట్టుకి ఓటమి తప్పదు. ఇది కూడా ఒక రకంగా నాకు పెద్ద

అవమానమే! ఇప్పుడేం చెయ్యాలి;" విజయ సారథి ఒక నిశ్చయానికి రాలేకపోయాడు.

# 13

హైస్కూలు ఆవరణమంతా చాలా కోలాహలంగా ఉంది. ఇంకా కొద్దిసేపటిలోనే ప్రారంభం కాబోయే హాకీ పోటీని చూడటానికిగాను బడిపిల్లలే కాకుండా పట్టణంలోని చిన్న, పెద్ద చాలామంది హాజరైనారు. అందులోను కెప్టెన్ వివేకానందమూర్తి పోటీ చూడటానికి వస్తాడనేవార్త వ్యాపించడంతో ఎన్నడు హాకీఆటను చూడనివాళ్లు, చివరికి హాకీ ఆట అంటే ఏమిటో తెలియనివాళ్లుకూడా ఎంతో ఉత్సాహంగా వచ్చారు.

హఠాత్తుగా టప్-టప్-టప్-టప్ అనే వింతశబ్దం వినవచ్చింది. పోటీని తిలకించడానికి వచ్చిన ప్రేక్షకులు హుషారుగా చప్పట్లు కొట్టినందున ఏర్పడిన శబ్దమది. ఆ శబ్దాన్ని అనుసరిస్తూనే థంప్-థంప్-థంప్-థంప్ అనే శబ్దం వినిపించింది. పోటీ జరిగే చోటికి కాస్త దూరంలోనే ఓ మామిడి చెట్టుమీద ఎవ్వరికి కనపడకుండా కూచున్నవిజయసారథి ఆ శబ్దం ఏమిటో అని జాగ్రత్తగా నలువైపులా కలయచూశాడు. కెప్టెన్ వివేకానందమూర్తికి హైస్కూలుకి చెందిన జాతీయ సేవాదళంవారు గౌరవవందనం సమర్పించడం వాడికి కనిపించింది.

కెప్టెన్ వివేకానందమూర్తికి ఆటలంటే ఎంతో ఇష్టం. బడిలో చదివే రోజులనుంచికూడా అతను ఆటలంటే ఎంతో

ఆసక్తి చూపేవారు. అతనికి అన్నిటికంటె చెడుగుడు ఆట అంటే చాలా ఇష్టం. చెడుగుడు ఆటలో ప్రావీణ్యం చూపినందుకు అతనికి ఎన్నో బహుమతులు వచ్చాయి. వివేకానందమూర్తికి హాకీ ఆట అన్నా ఇష్టమే! అందుకు ముఖ్యకారణం హాకీ ఆట ఆడే దేశాల్లో భారతదేశం అగ్రగణ్యమయినది కావడమే. గత పాతికసంవత్సరాలకి పైగా భారతీయులు హాకీ ఆటలో ప్రపంచ ఛాంపియన్‌షిప్‌ను సాధిస్తున్నారు. భారతీయుల జట్టుకి పోటీగా నిలవకలిగిన జట్టు ప్రపంచంలోనే లేదు. హాకీ ఆటలో భారతీయుల ప్రావీణ్యం, నేర్పు ప్రపంచంలోని అన్ని దేశాలవారిని దిగ్భ్రాంతుల్ని చేసింది. వారి ప్రశంసలను పొందింది. అన్నిటిని మించి, 'హాకీ మాంత్రికుడు' అయిన మేజర్ ధ్యాన్‌చంద్ అంటే వివేకానందమూర్తికి ప్రత్యేకాభిమానం, గౌరవం ఉంది. మేజర్ ధ్యాన్‌చంద్ ఆట చూసి తీరాలే కాని వర్ణింప సాధ్యంకాదంటాడు వివేకానందమూర్తి. ఆటలంటే అభిమానం ఉండటంవల్లను, తనను అంతగా ఆహ్వానించిన బడిపిల్లలని నిరుత్సాహపరచడం ఇష్టం లేనందువల్లను కెప్టెన్ వివేకానందమూర్తి తన ఇతర కార్యక్రమాలను రద్దు చేసుకుని హాకీపోటీని చూడటానికి ప్రత్యేకంగా వచ్చాడు.

విజయ సారథి ఆ ఉదయమే పట్టణం విడిచి తన ఊరు వెళ్ళిపోదామనుకున్నాడు. కాని, అందుకు వాడి మనసు అంగీకరించలేదు. సాయంకాలం జరిగే పోటీ ఎట్లా ఉంటుందో చూడాలనే కుతూహలం అధికం కావడంతో వాడు తన ప్రయాణాన్ని తాత్కాలికంగా వాయిదా వేసుకున్నాడు. ఎట్లాగూ తన జట్టు గెలవడం ఖాయం. ఆరవఫారం వాళ్ళ

జట్టు చిత్తుగా ఓడిపోక తప్పదు. కాని వాళ్ళ ఓటమిని, తన జట్టు గెలుపును కళ్ళారా చూసి ఆనందించాలనిపించడంతో విజయ సారథి ఇష్టం లేకపోయినా సమయానికి ఆట స్థలం చేరుకున్నాడు.

రెండుజట్లు ఆటస్థలం మధ్యలో గుమికూడి ఉండటం విజయసారథి చూశాడు. తన జట్టువాళ్లు ఎప్పటి మాదిరిగానే ఎర్రరంగు అరచొక్కాలు, తెల్లరంగు పొట్టిలాగులు ధరించడం వాడు గమనించాడు. ఆరవఫారంవాళ్లుకూడా మామూలుగానే నీలిరంగు అరచొక్కాలు, తెల్లరంగు పొట్టిలాగులు తొడుక్కున్నారు.

ఇంతలో రిఫరీ ఈలవేశాడు. రెండు జట్లవాళ్ళు గబగబా వచ్చి ఎదురెదురుగా నిలబడ్డారు. తరువాత ఆరవఫారం వాళ్ళ జట్టునుంచి శ్రీనివాసరావు — అయిదవ ఫారం వాళ్ళ జట్టు నుంచి రాజు ముందుకి వచ్చి కరచాలనం చేసుకున్నారు. అంటే, ఆరవఫారం వాళ్ళ జట్టుకి శ్రీనివాసరావుని అయిదవఫారం వాళ్ళ జట్టుకి రాజుని నాయకులుగా ఎన్నుకున్నారన్నమాట. తమ జట్టుకి రాజుని నాయకునిగా ఎన్నుకోవడం విజయ సారథిని ఆశ్చర్య పరిచింది. ఏమంటే, రాజు అంత పెద్ద ఆటగాడు కాదు. వాడి కంటే రాధాయే బాగా ఆడతాడు. "హుఁ, అదీ చూద్దాం. నేను లేకుండా రాజు నాయకత్వం క్రింద వీళ్ళు ఎంత మాత్రం గెలుస్తారో!" అని విజయ సారథి తనలో తాను అనుకున్నాడు.

రిఫరీ ఆ రెండు జట్ల నాయకుల బుజాల మీద చెరొక చెయ్యి వేసి మెల్లగా తట్టాడు. తదుపరి వాళ్ళు ముగ్గురు

తలలు వంచి ఏదో మెల్లగా గొణిగారు. అట్లా చేయడంలో అంతరార్థం ఏమంటే, రెండు జట్ల నాయకులు తాము సక్రమంగా ఆడతామని అంగీకరిస్తున్నారన్న మాట.

అటు పిమ్మట రిఫరీ ఓ నాణెం తీసి గాలిలోకి ఎగుర వేశాడు. ఆరవఫారం వాళ్ళ జట్టుకి బొమ్మ రావడంతో వాళ్లే ఆట ప్రారంభించ వలసి వచ్చింది.

రెండు జట్లవాళ్ళు ఎవరి స్థానాలను వాళ్ళు ఆక్రమించారు. ఇంతలో రిఫరీ ఈలవేశాడు. వెంటనే ఆట ప్రారంభమయింది. ఇరు పక్షాల వాళ్ళు బంతిని తమ అధీనంలో అట్టి పెట్టుకోడానికి, ఎదుటి వారి గోలు వద్దకు బంతిని తీసుకువెళ్ల డానికి తీవ్రంగా ప్రయత్నించ సాగారు. అన్నిటికన్నా ఆశ్చర్య కరమయిన విషయం ఏమంటే, సామాన్య ఆటగాడయిన శంకరం ఆ వేళ అత్యుత్సాహంగా అమితమయిన నేర్పుతో ఆడుతున్నాడు. గున్న ఏనుగులా ఉన్న ఆ మహాకాయుడు బంతిని చేజిక్కించుకుని ఆరవఫారం వాళ్ళ గోలు కేసి పురోగమిస్తుంటే, అందరు నోళ్లు తెరచుకుని ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు. వాణ్ణి అడ్డుపెట్టడానికి గాని, వాడి నుంచి బంతిని స్వాధీన పరుచుకోడానికిగాని, ఎవ్వరికీ సాధ్యం కాలేదు. కాని, చివరికి ఆరవఫారం వాళ్ళ జట్టు నాయకుడయిన శ్రీనివాసరావే తెగించి శంకరానికి అడ్డు తగిలి, కాస్సేపు తిప్పలు పడిన మీదట బంతిని వాడి కబంధ హస్తం నుంచి తప్పించగలిగాడు.

కాని, శంకరం మట్టుకు సామాన్యుడా? వాడు తన ప్రయత్నాన్ని మానలేదు. పట్టుదల వదల్లేదు. రెట్టించిన

ఉత్సాహంతో ఆరవఘారం వాళ్లతో పోరాడి తిరిగి బంతిని తన స్వాధీనంలోకి తెచ్చుకుని ఎదుటి పక్షం గోలు వైపు బయల్దేరాడు. కాని, వాడి ప్రయత్నం ఫలించలేదు. సమయానికి ఆరవఘారం వాళ్ల జట్టు గోల్ కీపర్ అడ్డుపడటంతో వాడి ప్రయత్నం వృథా అయింది.

"ప్చ్, ఏంచేస్తాం? గోల్ అయ్యే అవకాశం కొద్దిలో తప్పింది." విజయసారథి తనలో తాను అనుకున్నాడు.

"ఆరవఘారం వాళ్ళ గోల్‌కీపర్ మొత్తానికి ఘటికుడిలా ఉన్నాడు! ఎంతో సమయస్ఫూర్తిని, చాకచక్యాన్ని ప్రదర్శించి గోల్ కాకుండా నివారించకలిగాడు" కెప్టెన్ వివేకానందమూర్తి మెల్లగా అన్నాడు.

రాజారావు మాస్టారు ఆట చూస్తున్నాడన్నమాటేకాని, ఆయన మనసంతా విజయసారథిమీదే ఉన్నది. వాడు ఎవ్వరితోను మాటమాత్రమయినా చెప్పకుండా ఎక్కడికి వెళ్లాడోనని ఆయన ఆలోచించసాగాడు. విజయసారథి పలాయనంకంటే ఆయనను ఆశ్చర్యపరచిన విషయం కెప్టెన్ వివేకానందమూర్తి మౌనం. వివేకానందమూర్తి తన తమ్ముడి గొడవే ఎత్తకుండా మామూలుగా ఉండటం ఆయనను చకితుణ్ణి చేసింది, దిగ్భ్రాంతుణ్ని గావించింది.

కాని, కెప్టెన్ వివేకానందమూర్తిమాత్రం ఆ గొడవ ఏమీ పట్టించుకున్నట్లు లేదు. అతను ఆటమోజులో పడి తన తమ్ముడి విషయమే మరిచిపోయినట్లు కనిపించాడు. రాజారావు మాస్టారికి కెప్టెన్ వివేకానందమూర్తి మనస్తత్వం ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

# 14

క్రమంగా ఆట రసవత్తరఘట్టంలో పడింది.

శంకరం విఫలప్రయత్నం తర్వాత అయిదవఫారంవాళ్లు ఎల్లాగయినా ఒకగోలు చెయ్యాలని ఎన్నోసార్లు ప్రయత్నించారు. కాని, వాళ్ళ ఆటలేమీ సాగలేదు. అదీగాక, శ్రీనివాసరావు నాయకత్వం క్రింద ఆరవఫారంవాళ్లు మున్నెన్నడు లేనంత కలిసికట్టుగా, నేర్పుగా ఆడుతున్నారు. దాంతో అయిదవ ఫారంవాళ్ళ పరిస్థితి తలక్రిందులయింది. వాళ్ళలో ఉత్సాహంకూడా తగ్గిపోసాగింది. రానురాను ఆట నీరసించింది.

తనజట్టు దుస్థితిని చూస్తూన్న విజయసారథికి ఓవైపు విచారం, మరోవైపు సంతోషం కలిగాయి. తను లేనందున ఎటువంటి విషపరిణామం కలిగిందీ, తనజట్టు ఎంతగా నీరసించిపోయిందీ తలచుకుని వాడు సంతృప్తిచెందాడు. ఇది నిజంగా తన జట్టువాళ్ళకి ఓ గుణపాఠం. తను ఎటువంటి ఆటగాడో, తన నాయకత్వం ఎటువంటిదో వాళ్లకి ఇప్పుడుగాని బాగా తెలిసిరాదు.

హఠాత్తుగా శ్రీనివాసరావు మెరపువలె అయిదవ ఫారంవాళ్ల రక్షణశ్రేణిని తప్పించుకుని గోలువైపు పురోగమించ సాగాడు. వాడి వేగం, మెలకువ చూస్తున్న అయిదవ ఫారంవాళ్ళకి ఏంచేయడానికి తోచలేదు. అయిదవఫారంవాళ్ల గోల్‌కీపర్ అయిన సత్యం బంతిని ఆపడానికి ప్రయత్నించాడు కాని సాధ్యం కాలేదు. బంతి, తుపాకి తూటావలె దూసుకుపోయి కొద్దిశబ్దంచేస్తూ తీగెవలకి తగిలింది.

ఇంకేముంది ? ఒకగోలు అయింది.

ఆరవ ఫారం జట్టును బలపరిచేవాళ్లు హుషారుగా చప్పట్లు కొట్టారు.

అయిదు నిమిషాల తర్వాత ఆరవఫారంవాళ్ల జట్టు మరో గోలు చేసింది.

ఆ దెబ్బతో అయిదవ ఫారంవాళ్లు బిత్తరపోయారు. వాళ్లకి ఏంచేయడానికి కాళ్లు, చేతులు ఆడటంలేదు. వాళ్లలో నీరసం, నిరుత్సాహం, ఓటమి తప్పదనే భయం పెనవేసుకున్నాయి. ఇది అదనుగా తీసుకుని ఆరవఫారంవాళ్ళు మరింత విజృంభించి ఆడసాగారు. వాళ్ల ధాటికి పోటీగా నిలబడాలంటే అయిదవ ఫారంవాళ్ల జట్టుకి విజయసారథి నాయకత్వం వహించి తీరాలనే నిర్ణయానికి అందరు వచ్చారు. శ్రీనివాసరావు ఆట కట్టించడానికి ఒక్క విజయసారథే సమర్థుడని భావించారు. కాని, ఆ విజయసారథి ఇప్పు డేడీ ? ఎక్కడ ఉన్నాడు ? ప్రతి ఒక్కరు విజయసారథి హఠాత్తుగా అంతర్ధానం కావడాన్ని గూర్చి ఆలోచించసాగారు.

మరి కొన్ని నిమిషాల్లోనే ఆరవఫారంవాళ్ళు మూడవ గోలు చేశారు.

అసలు ఆరవఫారంవాళ్ళు రెండవ గోలు చేసేసరికే విజయసారథి దృక్పథంలో ఎంతో మార్పు వచ్చింది. తన జట్టు గోలులోకి రెండవసారి బంతి దూసుకుపోవడం వాడు చూడలేకపోయాడు. ఆ విధంగా తనజట్టు గోలువెంట గోలు చేయించుకోవడం వాడు సహించలేకపోయాడు. వాడిలో అభిమానం తలఎత్తింది. పౌరుషం పొంగి పొర్లింది. ఇంకా

కాసేపు తనజట్టు అట్లాగే ఆడితే అవతలజట్టు ఎన్ని గోలులు చేస్తుందోనని వాడు భయపడ్డాడు. తన జట్టులోవాళ్లందరు ఒట్టి దద్దమ్మలుగా తయారుకావడం చూసి వాడు సిగ్గుతో కృంగిపోయాడు. మాధవరావు, రాధాయి, రాజు – ఒక డేమిటి ? అందరు ఎందుకు పనికిమాలిన చచ్చుఆట ఆడుతున్నారు. ఆ శంకరంగాడు ! వాడు అన్నంగరిటె త్రిప్పుతున్నట్లు ఉంది గాని హాకీకఱ్ఱ త్రిప్పుతున్నట్టుగా లేదు.

"మీరందరు ఏంచేస్తున్నారోయి చచ్చు వెధవాయిలూ? ఆట ఆడటం మాని ఇంటికి వెళ్లి ముసుగు వేసుకుని మూల కూచోండి, పోండి" అని పెద్దగా అరుద్దామనిపించింది విజయసారథికి. మూడవసారి బంతి వచ్చి తమగోలులో పడటం చూసేసరికి వాడికి ఏడుపువచ్చినంత పనయింది. తన జట్టు అంత పరాభవం పొందుతుందని వాడు కలలోకూడా ఊహించలేదు. ఇప్పటికి సరిగా పావుగంట గడిచిందో, లేదో అప్పుడే అవతలజట్టు మూడుగోలులు చేసిందాయె ! మరి, తనజట్టో ? ఒక్క గోలుకూడా చేయలేదు. రానురాను తనజట్టు ఆట మరింత దిగజారిపోవడం వాడు గమనించాడు.

"నేనెంత బుద్ధిహీనుణ్ణి ! పిరికివాణ్ని ! మిత్రద్రోహిని !" విజయ సారథి తనలో తాను అనుకున్నాడు." ఇటువంటి విషమ పరిస్థితిలోనా జట్టుని వదిలి ఇట్లా ముసలమ్మ వలె కాళ్ళు ముడుచుకుని కూచోవడం. ఎంత తెలివి తక్కువ ?" విజయ సారథి ఓసారి తన "అన్నయ్య" అయిన కెప్టెన్ వివేకానందమూర్తిని తలచుకున్నాడు. ఊహుఁ, తన అన్నయ్య ఎన్నడూ ఇట్లా తన మాదిరిగా ప్రవర్తించడు. ప్రవర్తించలేదు

కూడా! తనతోటి వాళ్ళు విషమ పరిస్థితిలో ఉంటే అతను ఎన్నడు వాళ్లను విడిచిపెట్టి ఉండడు. ఎన్నటికి వాళ్లని ఏకాకులను చేసి దూరంగా తొలిగిపోడు. తన అన్నయ్య అటువంటివాడు కాదు...అటువంటివాడు కాదు...

విజయ సారథి వెంటనే ఓ నిర్ణయానికి వచ్చాడు.

# 15

ఆరవ ఘోరం వాళ్ళు నాలుగవ గోలు చేయడానికి ఉద్యుక్తు లవుతున్నారు. సరిగా అదే సమయంలో ఒక పిల్ల వాడు రిఫరీ వద్దకు వెళ్లి బిగ్గరగా అన్నాడు.

"రిఫరీ, నేను కూడా ఆడతాను."

ఆ కంఠస్వరం వినగానే పిల్లలందరు ఓ సారి ఉత్సాహంగా అటు కేసి చూసారు.

"విజయ సారథీ, నువ్వా? ఇప్పటిదాకా ఏం చేస్తున్నావు?"

విజయసారథి బదులుగా ఆడుతున్న విశ్వం వెంటనే తన హాకీ కర్రను వాడి చేతికి అందించి తను ప్రక్కకి తప్పుకున్నాడు.

"ఊం, ఇక హుషారుగా ఆడండి! మీ శక్తి యుక్తులు ప్రదర్శించండి!" విజయ సారథి తన మామూలు ధోరణిలో అన్నాడు. "కుడివైపుకి కదలండి. ఊం, మెరపువలె ఆడాలి."

ఆ విధంగా విజయ సారథి హఠాత్తుగా ఊడిపడటం, వచ్చీరావడంతోటే ఆజ్ఞలు జారీచేయడం వగైరా తతంగం చూసే సరికి శ్రీనివాసరావుకి కాళ్ళు, చేతులు ఆడలేదు.

విజయ సారథి తిరిగి వస్తాడని, ఆటలో పాల్గొంటాడని వాడు ఊహించలేదు. అందువల్లనే, చెప్పకుండా, చెయ్యకుండా విజయ సారథి ప్రత్యక్షం కావడంచూసి వాడు బిత్తర పోయాడు. తత్తరపాటు చెందాడు.

ప్రతివారు అటు కెప్టెన్ వివేకానందమూర్తి కేసి, ఇటు విజయ సారథి కేసి రెప్పవాల్చకుండా చూడసాగారు. ఇంతకీ కెప్టెన్ వివేకానందమూర్తి తన తమ్ముణ్ణి గుర్తించాడా, లేదా? అనే సందేహంతో సతమతం కాసాగారు.

కాని. కెప్టెన్ వివేకానందమూర్తిలో మట్టుకు ఎట్టి మార్పురాలేదు. అతను పూర్వం వలె ఉత్సాహంగా ఆటను తిలకిస్తూ కూచున్నాడు అంతే!

శ్రీనివాసరావు తత్తరపాటు క్రమంగా వాడి జట్టు వాళ్లకి ప్రాకింది.

విజయసారథి తిరిగి రావడంతో అయిదవఫారంవాళ్లకి వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. తాము తప్పక గెలవగల మనే ధైర్యం కలిగింది. దాంతో వాళ్లు సమధికోత్సాహంతో దెబ్బతిన్న బెబ్బులులవలె ఆడసాగారు.

అట్లా ఓ నిమిషం గడిచిందో, లేదో ఆరవఫారంవాళ్ళ గోలులోకి బాణంలా బంతి దూసుకువచ్చింది. అది ప్రత్యే కించి విజయసారథి చేసిన గోలు. వాడి ఆటతీరు చూసిన ప్రేక్షకులేగాక ఆరవ ఫారం వాళ్ళుకూడా దిగ్భ్రమ చెందారు. ఆ దిగ్భ్రమ నుంచి వాళ్లు సరిగా తేరుకోకముందే వాళ్ల గోలు లోకి విజయ సారథి పంపిన మరో బంతి రివ్వున వచ్చి పడింది. వెంట వెంటనే రెండు గోలులు ఒకే వ్యక్తి చేయడం

ప్రేక్షకుల ఆశ్చర్యం పరిచింది. వాళ్ళు విజయ సారథిని అభినందిస్తూ చాలాసేపు చప్పట్లు కొట్టారు. మరు నిమిషంలో ఇంకో గోలు అయ్యేదే కాని, ఆ అవకాశాన్ని శంకరం చెడగొట్టాడు. విజయ సారథికి బంతిని అందివ్వడానికి బదులు వాడు బంతిని గట్టిగా ఎడమవైపుకి కొట్టేసరికి అది గీతదాటి ప్రక్కనే ఉన్న కాలువ కేసి వేగంగా సాగిపోయింది.

ఆట ఆగిపోయింది. ఇరుపక్షాలవారు బంతి కేసి చూస్తూ ఉండిపోయారు.

కాని, శ్రీనివాసరావు మట్టుకు అందరివలె ఊరుకోలేదు. వాడు బంతి తీసుకురావడానికిగాను దాని వెంట పరిగెత్త నారంభించాడు. బంతిని పట్టుకోవాలనే హడావిడిలో వాడు అక్కడ కాలవ ఉన్నదనే సంగతికూడా పూర్తిగా మరిచిపోయాడు. అంతే! కాలవ ఒడ్డున బంతిని అందుకోడానికని వంగినవాడు తూలి ముందుకి పడ్డాడు, తరువాత వాడు కనిపించలేదు. కాని, నీళ్ళలో ఏదో బరువయిన పదార్థం పడిన చప్పుడు మాత్రం చాలామందికి వినిపించింది.

వెంటనే అందరు అటు కేసి ఆదుర్దాగా పరిగెత్తారు. ఆ ప్రదేశానికి మొదట చేరుకున్నవాడు ఆరవఫారం జట్టులోని వెంకట్రావు అయినా, విజయసారథి వాణ్ణి వెనక్కి త్రోసివేసి తాను తెగించి కాలవలోకి దూకాడు.

శ్రీనివాసరావు రక్షించమని అరవడంలేదు. కనీసం చేతులెత్తి అయినా ఎవరినీ పిలవడంలేదు. వాడు నీటిలో మునకలేస్తూ మళ్లీ ఎట్లాగో తెప్పరిల్లుకుని ఈదడానికి ప్రయత్నం చేస్తూ – ఈవిధంగా కాలవ ప్రవాహం వెంట కొట్టుకు

పోతున్నాడు. కాలవలో దూకిన విజయసారథి శ్రీనివాస రావుని చేరుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. తన శక్తికిమించి ఈదుతున్నాడు. తన వెనుక జనం చేసే గోల, తనను పిలుస్తున్న కేకలు వాడికి వినిపించకపోలేదు. కాని, వాడికి వెనుకకి తిరగడానికి తగిన వ్యవధి లేదు.

"ఒరేయ్...శ్రీనివాసూ...ఇటుచూడు...ఇటు...నా వైపు...శ్రీనివాసూ!" విజయసారథి శ్రీనివాసరావుకి కాస్త దూరంలో ఈదుతూ తన హాకీకర్రను వాడికి అందిస్తూ అన్నాడు. శ్రీనివాసరావు అతి ప్రయత్నంమీాద తల కాస్త ప్రక్కకి త్రిప్పి చూశాడు. వాడికి హాకీ కర్ర కనిపించింది. వెంటనే వాడు దాన్ని గట్టిగా పట్టుకున్నాడు. విజయసారథి తన శరీరంలో ఉన్న శక్తినంతా వినియోగించి హాకీకర్రను తనవైపు లాగడానికి ప్రయత్నం చేశాడు. కాని, వాడి ప్రయత్నం విఫలమయింది విజయసారథి ఆవిధంగా కొన్ని క్షణాలు శ్రమించాడు. కాని, వాడి శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరు అయింది. ప్రవాహావేగాన్ని త్రోసిరాజనే శక్తి వాడిలో లేకపోయింది. క్రమంగా వాడి బలం క్షీణించ సాగింది. విజయసారథి కూడా కర్ర గట్టిగా పట్టుకుని శ్రీని వాసరావు వెంట ప్రయాణం చేస్తున్నాడు.

ఇదంతా కొన్ని క్షణాల్లో జరిగిపోయింది. అప్పుడే జనాన్ని చీల్చుకుంటూ కాలవ ఒడ్డుకి చేరిన కెప్టెన్ వివేకా నందమూర్తి ఆ దృశ్యం చూశాడు. అంతే! తరువాత అతను ఒక్క క్షణంకూడా ఆలస్యం చేయలేదు. కాలవ ఒడ్డునే ఒకింత ముందుకి పరువెత్తి అమాంతం కాలవలోకి దూకాడు. అతను

గబగబా ఈదుకుంటూ వెళ్ళి శ్రీనివాసరావుని చేరుకున్నాడు. అప్పటికే వాడికి స్పృహ తప్పిపోయినట్లు అనుమానంవేసింది. విజయసారథి స్థితికూడా అంతంతమాత్రంగానే ఉంది. వాడు, ఏదో చేతులయితే ఆడిస్తున్నాడన్నమాటే కాని, మనిషి మామూలు తెలివితేటల్లో లేడు. ఇంకా కొన్ని క్షణాలు అట్లాగే ఉంటే వాడికికూడా స్పృహ తప్పిపోవడం ఖాయమని కెప్టెన్ వివేకానందమూర్తి తలంచాడు. అతను వెంటనే శ్రీని వాసరావుని నీటిలో మునిగిపోకుండా తన వీపుమీద పడుకో పెట్టుకుని, ఒకచేత్తో విజయసారథిని గట్టిగా పట్టుకుని ఒడ్డుకేసి ఈదసాగాడు. ఇంతలో ఎవరో ఈదుకుంటూ వచ్చి శ్రీని వాసరావుని తనవీపుమీద ఎక్కించుకుని ఒడ్డుకేసి సాగాడు. అప్పుడుకాని కెప్టెన్ వివేకానందమూర్తికి తను పట్టుకువస్తున్న పిల్లవాడి పరిస్థితి ఎట్లా ఉందోనని చూసే అవకాశం కలుగ లేదు. అతను వెంటనే విజయసారథిని తన రెండుచేతులతో ఎత్తి పట్టుకుని ఒడ్డుకేసి నడుస్తూ పరిశీలనగా చూశాడు. వాడికి ఇంకా స్పృహ అయితే తప్పలేదుకాని, మనిషిమట్టుకు నీటి దెబ్బకి తన మామూలు తెలివితేటలను కోల్పోయినట్టు కని పించాడు.

కెప్టెన్ వివేకానందమూర్తి ఒడ్డుకి చేరగానే చాలా మంది జనం అతనిచుట్టూ చేరి ఆదుర్దాగా ప్రశ్నలు వేయ సాగారు. కొందరు అతన్ని పొడిగుడ్డలు కట్టుకోమని తొందర చేశారు.

"నాకేం ఫర్వాలేదు. నాకు ఇటువంటివి అలవాటే! ముందు ఈ పిల్లవాళ్ళ సంగతి చూడండి. వెంటనే ఎక్క

డయినా ఓ కారు సంపాయించడి." కెప్టెన్ వివేకానంద మూర్తి వగరుస్తూ అన్నాడు. తరువాత తన చేతుల్లో ముడుచుకుపోయి ఉన్న విజయ సారథి కేసి జాలిగా చూస్తూ అప్యాయంగా అన్నాడు: "ఎట్లా ఉంది తమ్ముడూ? ఇంకా నీకేం భయం లేదులే!"

"నాకు...నాకు...బాగానే ఉంది." విజయ సారథి మెల్లగా అన్నాడు.

# 16

విజయ సారథిని, శ్రీనివాసరావుని కారులో పడుకో పెట్టుకుని కెప్టెన్ వివేకానందమూర్తి, హెడ్మాస్టారు మొదలగు వారు మొట్ట మొదట శ్రీనివాసరావు ఇంటికి వెళ్లారు. శ్రీని వాసరావుని వాడి తల్లి దండ్రులకు అప్పగించారు. అప్పటికి వాడికి కాస్త స్పృహ వచ్చింది. శ్రీనివాసరావు తల్లి వాణ్ని ఓ మెత్తని ప్రక్కమీద పడుకోబెట్టి, వాడికి రెండు మూడు దుప్పట్లు కప్పి, ఓ గ్లాసు కాఫీ ఇచ్చి తగిన సపర్య చేయ సాగింది.

కెప్టెన్ వివేకానందమూర్తి విజయ సారథిని తను ఉంటున్న రహదారి బంగళాకు తీసుకు వెళ్లాడు. అందుకు కారణం విజయ సారథి హాస్టల్‌లో ఉంటున్నాడని, వాడి బంధువులు ఎవ్వరూ ఆ పట్టణంలో లేరని అతనికి తెలియ డమే! అంతకు మించి మరేమీ కాదు.

తరువాత కాసేపటికల్లా ఓ డాక్టరు కెప్టెన్ వివేకానంద మూర్తి ఉన్న గదికి వచ్చాడు. అప్పటికి విజయసారథి వివేకా

నందమూర్తి ఇచ్చిన వేడి వేడి కాఫీ త్రాగి హాయిగా మంచం మీద పడుకున్నాడు. వాడు కెప్టెన్ వివేకానందమూర్తి ధరించే పొడుగాటి ఉన్నికోటు తొడుక్కున్నాడు. వివేకానంద మూర్తి అంతకు పూర్వమే చేసిన ప్రాథమిక చికిత్సల వల్ల వాడికి కాస్త ఉత్సాహం. ఉసులుబాటు చిక్కాయి.

కెప్టెన్ వివేకానందమూర్తి మామూలు పైజమా, చొక్కా, తొడుక్కుని విశాలమయిన ఆ గదిలో అటు ఇటు పచార్లు చేస్తున్నాడు. మధ్యమధ్య విజయసారథికేసి కుతూహలంగా చూస్తున్నాడు.

డాక్టరు వచ్చి విజయసారథిని పరీక్షించాడు. ఆదుర్దా పడవలసిన అవసరమేమీ లేదని, ఒకటి రెండురోజులు పూర్తి విశ్రాంతి తీసుకోవడం అవసరమని చెప్పి వెళ్ళిపోయాడు.

"డాక్టరు చెప్పింది విన్నావుకదూ!" కెప్టెన్ వివేకానందమూర్తి విజయసారథి దగ్గిరికి వచ్చి అన్నాడు. "రేపు, ఎల్లుండి ఇక్కడే ఉండి హాయిగా విశ్రాంతి తీసుకో! ఏమిటి, సరేనా ?"

విజయసారథి సరేనన్నట్లు తలత్రిప్పాడు. కెప్టెన్ వివేకానందమూర్తి ప్రేమాదరాలు వాణ్ణి ముగ్ధుణ్ణిచేశాయి. అమితమయిన సంతోషాన్ని కలిగించాయి. వాడు తనలో తాను చిన్నగా నవ్వుకున్నాడు.

నువ్వు బాగా, కాదుకాదు, బ్రహ్మాండంగా ఆడావు. కాని, ఏం ప్రయోజనం? మీజట్టు ఇంకా ఒకగోలు వెనకే పడి ఉంది. అయినా ఇప్పుడు మునిగిపోయింది ఏమీ

లేదనుకో! నీకు కులాసా చిక్కిన తర్వాత మళ్ళీ ఆడి నీ జట్టుని గెలిపించాలి. ఏమంటావు?"

విజయ సారథి ఏమీ మాట్లాడలేదు. తలమాత్రం తాటిబుర్రలా త్రిప్పి ఊరుకున్నాడు.

"ఊఁ, ఇక హాయిగా పడుకో! నీకు పూర్తి విశ్రాంతి అవసరం" అంటూ కెప్టెన్ వివేకానందమూర్తి ప్రక్క గది లోకి వెళ్లిపోయాడు.

"కెప్టెన్ వివేకానందమూర్తి మా అన్నయ్యే అని తాను నలుగురితోను చెప్పి నమ్మించిన సంగతి అతనికి పొరపాటున తెలిస్తే...! అమ్మో, ఇంకేమయినా ఉందా?" విజయసారథి తనలో తాను అనుకున్నాడు. "నన్ను ఇక్కడ ఒక్క క్షణం కూడా ఉండనివ్వడు. వెంటనే బయటికి పంపించేస్తాడు. కాబట్టి తనే ఆ విషయాన్ని ముందుగా చెపితే బావుంటుంది. ఆ చెప్పడంకూడా ఇప్పుడు కాదు. తరువాత..."

అటువంటి ఆలోచనలతోనే విజయసారథికి మెల్లగా కునుకుపట్టింది.

మరుసటిరోజు ప్రొద్దుట వాడు లేచేసరికే కెప్టెన్ వివేకానందమూర్తి కాలకృత్యాలు అవీ తీర్చుకుని, దుస్తులు ధరించి, బయటికి పోవడానికి సిద్ధంగా ఉన్నాడు. ఆరోజు వివేకానందమూర్తి పూర్తి సైనికదుస్తుల్లో ఉన్నాడు. కెప్టెన్ హోదాను సూచించే పతకాలు ముచ్చటగా పెట్టుకున్నాడు. తలమీద అందమయిన టోపీ నిలిచిఉంది.

కెప్టెన్ వివేకానందమూర్తి తన టేబులువద్ద కూచుని ఏదో కాగితాన్ని శ్రద్ధగా చదువుతున్నాడు. మధ్య

మధ్య కనుబొమలు ఎగరేస్తూ తన ఆశ్చర్యాన్ని ప్రకటిస్తున్నాడు.

నిద్ర లేచీ లేవడంతోటే అసలు విషయాన్ని కెప్టెన్ వివేకానందమూర్తికి దాపరికం లేకుండా చెప్పేద్దామనుకున్నాడు విజయసారథి. "అతను నన్ను దయతో రక్షించాడు. నా ప్రాణాన్ని కాపాడాడు. అట్టి ప్రాణదాతతో అసలుసంగతి చెపితే కాని నాకు శాంతిలేదు. అటువంటి కరుణామయునివద్ద రహస్యాలను దాచడం ఎంతో పాపంకూడా! కనుక, ఆ సంగతి వెంటనే చెప్పివేస్తాను...వెంటనే చెప్పివేస్తాను" విజయసారథి తనలో తాను అనుకున్నాడు.

నీ ఒంట్లో ఎట్లాఉంది సారథీ?" కెప్టెన్ వివేకానంద మూర్తి విజయసారథి దగ్గిరికి వచ్చి అన్నాడు. "రాత్రి బాగా నిద్రపట్టిందా?"

"బాగానే నిద్రపట్టిందండి" విజయసారథి తలవంచుకుని మెల్లగా అన్నాడు. "ఇప్పుడు నాకేమీ బాధల్లేవు. చాలా కులాసాగా ఉన్నాను."

"చాలా సంతోషం. ముందు నువ్వు వెళ్లి ముఖం కడుక్కురా. నీకో సంగతి చెప్పాలి."

విజయసారథి ముఖం కడుక్కుని వచ్చేసరికి పొగలు క్రక్కుతున్న వేడి కాఫీ బల్లమీద ఉంది. వాడు మారు మాట లేకుండా కాఫీకప్పు అందుకున్నాడు.

"నీ లాగుజేబులో ఓ ఉత్తరం ఉన్నట్టు ప్రొద్దుట నీ గుడ్డలు ఉతకడానికి తీసుకువెళ్లిన చాకలి చెప్పాడు. ఆ ఉత్తరాన్ని నేను తీసుకున్నాను. నీకు ఇద్దామంటే నువ్వు అప్పటికి

నిద్ర లేవలేదు. తీరా ఆ కవరు ఏమిటో అని చూస్తే దాని మీద నా చిరునామా ఉంది. ఆశ్చర్యంవేసింది. కవరు చింపి చదివాను. కాని, నాకు ఏమీ అర్థంకాలేదు..."

విజయసారథికి గుండె ఆగినంత పనయింది. వాడికి కాఫీ త్రాగబుద్ధి వేయలేదు. ఎంత ప్రయత్నించినా అసలు గుటక పడితేనా? ఆ ఉత్తరం కెప్టెన్ వివేకానందమూర్తి పేర హెడ్మాస్టారు వ్రాసినదేనని వాడు ఇట్టే పసిగట్టాడు. దీనంగా ముఖం పెట్టి దిగులుగా వివేకానందమూర్తికేసి చూస్తూ కూచుండిపోయాడు.

"ఆ ఉత్తరం నీకు చదివి వినిపిస్తాను. జాగ్రత్తగా విను" అంటూ వివేకానందమూర్తి ఉత్తరాన్ని చదవడం ప్రారంభించాడు :

"గౌరవనీయులయిన కెప్టెన్ కూనపులి వివేకానంద మూర్తిగారికి,

"నమస్కారములు. మీకు ఈ ఉత్తరం వ్రాయడానికి ఎంతగానో బాధపడుతున్నాను. అందుకు కారణం, మీ తమ్ముడు విజయసారథిని గూర్చి కొన్ని బాధ కరమయిన విషయాలను మీ దృష్టికి తీసుకురావడం అవసరం కనుక! అది నా బాధ్యత అనే సత్యాన్ని మీరు గుర్తిస్తారని తలుస్తాను. తన విద్యార్థి ఎవరైనా పెడదారిన పడి పోతుంటే చూస్తూ ఊరుకోవడం ధర్మం కాదుగదా! అయిదవఫారం చదువుతున్న మీ తమ్ముడు విజయసారథికి ఈమధ్య చదువంటే పూర్తిగా శ్రద్ధ తప్పింది—' ఇదేవిధంగా ఉత్తరమంతా నా తమ్ముడి చదువుని గురించి హెడ్మాస్టారిచేత వ్రాయ

బడింది. అసలు ఈ గొడవ ఏమీ నాకు అంతుపట్టడం లేదు. అన్నిటికన్నా ఆశ్చర్యకరమయిన విషయ మేమంటే, ఈ ఊళ్లోనే గాక నాకు ఏ ఊళ్లోకూడా తమ్ముడు లేడు. అటువంటప్పుడు నా 'తమ్ముణ్ణి' గురించి వ్రాయడం నాకు ఆశ్చర్యంగా ఉంది. ఈ కొత్తతమ్ముడు ఎవరో నాకు ఎంత ఆలోచించినా అర్థం కావడంలేదు" కెప్టెన్ వివేకానందమూర్తి ఆశ్చర్యంగా అన్నాడు.

"హెడ్మాస్టారు వ్రాసింది నా గురించే!" విజయసారథి వినీ వినపడనట్లుగా చెప్పాడు. ఆ మాటలు చెపుతుంటే వాడి గుండె దడ దడలాడింది. కంఠం వణికింది. "నాకు చదువు మీద శ్రద్ధతప్పి ఒక్క నెల మాత్రమే అయింది. అంతకు పూర్వం నేను బాగానే చదువుకున్నాను. నిజంగా..."

విజయ సారథి ప్రక్కనే ఉన్న కిటికీ గుండా బయటికి పారిపోదామనుకున్నాడు. కాని, వాడి కాళ్లు వాడి మాట వినలేదు.

"నీ చదువు సంగతి అట్లా ఉంచు. అయినా నీ చదువును గూర్చిన విచారణ నాకు అనవసరం. ఏమంటావు? అది సరే, మరి ఈ ఉత్తరం 'మీ తమ్ముడు' అని వ్రాసిందేమిటి? ఇందులో 'మా తమ్ముడు' ఎవరు? కెప్టెన్ వివేకానందమూర్తి అన్నాడు.

"నేనే ఆ తమ్ముణ్ణి" విజయ సారథి గొణిగాడు.

"ఏమిటి, నువ్వా? కెప్టెన్ వివేకానందమూర్తి విస్తుపోతూ అన్నాడు.

"అవును. నేనేనండి మీ తమ్ముణ్ని."

"నువ్వు నా తమ్ముడివా ? చచ్చాంపో. నిన్న నీటిలో మునిగి నందున నీకు జ్వరంవచ్చిందనుకుంటాను. అందుకే ఇట్లా మాట్లాడుతున్నావు. ఉండు, ముందు ధర్మామీటరు తెచ్చి టెంపరేచర్ చూస్తాను."

"అవసరం లేదండి. నేను నిజమే మాట్లాడుతున్నాను. నేను, మీరు ... మరి...అహాఁ, ... కాదు...మీరు, నేను..."

ఊఁ, త్వరగా చెప్పు. నేను, నువ్వు ... లేకపోతే నువ్వు, నేను...తరువాత సంగతి పూర్తి చెయ్యి మరి."

"నేను మీ గురించి పత్రికల్లో చాలాసార్లు చదివాను. అంతేకాదు. విమానాలను గూర్చి, విమానాలను నడపటం గురించి కూడా ఎంతో చదివాను. మీవంటి విమాన వీరుడు నాకు అన్నయ్య అయితే ఎంత బావుంటుందోనని ఆలోచించాను. ఎన్నో రోజులు అట్లా ఊహించుకుని కలలు కన్నాను. ఆ సంగతి ఊరికే తమాషాకి అందరికి చెప్పాను. అందరు నేను చెప్పేది నిజమని నమ్మారు. నేను మీ తమ్ముణ్ణని గాఢంగా విశ్వసించారు."

కెప్టెన్ వివేకానందమూర్తి ఏమీమాట్లాడ లేదు. విజయ సారథి చెప్పే మాటలని శ్రద్ధగా వింటూ కూచున్నాడు.

"నేను, మీరు నాకు అన్నయ్య అవుతారని చెప్పిన విషయం ఒక్కటే అబద్ధం. నేను విమానాలను గూర్చి చదవడం నిజం. కావలిస్తే మీరు ప్రశ్నలు వేయండి. జవాబు చెపుతాను." విజయ సారథి వినయంగా అన్నాడు.

"నిజంగానా ? అయితే జాగ్రత్తగా విను. నీ విమానం ఆకాశంలో ప్రయాణం చేస్తున్నది. అప్పటిదాకా ప్రశాంతంగా, మామూలుగా ఉన్న వాతావరణంకాస్తా హఠాత్తుగా మారిపోయింది. విపరీతమయిన గాలి చెలరేగింది. ఎక్కడి నుంచో నల్లని మబ్బు తునకలు జల్లు జల్లుగా ఉరకలతో, పరుగులతో వచ్చి చుట్టూ మూగుతున్నాయి. దారి కనిపించడం లేదు. ఏ దిక్కూ తోచడం లేదు. అట్టి విషమ స్థితిలో విమానాన్ని ఎక్కువసేపు ఆకాశంలో ఎగరనీయడం చాలా ప్రమాదం. కాని, క్రిందికి దించడం ఎట్లా ? అట్టి స్థితిలో నువ్వు ఏం చేస్తావో చెప్పు ?" కెప్టెన్ వివేకానందమూర్తి అన్నాడు.

"ఇంతకీ. అన్ని యింజన్లు పని చేస్తున్నాయంటారా ?" విజయ సారథి వెంటనే ప్రశ్నించాడు.

"ఆహాఁ, చక్కగా పని చేస్తున్నాయి."

విజయ సారథి తాను చదివిన "విమానయానం-కొన్ని ముఖ్య సూచనలు" అనే గ్రంథంలోని వాక్యాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ కెప్టెన్ వివేకానందమూర్తి ప్రశ్నకి జవాబు చెప్పాడు.

తరువాత వివేకానందమూర్తి వాణ్ణి విమానయానానికి సంబంధించిన విషయాలలో ప్రశ్నలు అడిగాడు. వాడు ప్రతి ప్రశ్నకీ సరయిన జవాబు చెప్పాడు. అదీ మామూలుగా చెప్పాడా ? విమాన శాస్త్రంలో సిద్ధహస్తునివలె, విమానాలు నడపడంలో ప్రవీణునివలె ఎక్కడా తొట్రుపాటు అనేది లేకుండా బహు తాపీగా, తిన్నగా చెప్పాడు. వాడి జవాబులు

విని కెప్టెన్ వివేకానందమూర్తి నిజంగా దిగ్భ్రమ చెందాడు. వాడు అంతటివిజ్ఞానాన్ని ఎట్లా సంపాదించాడో, అతనికి అర్థం కాలేదు. బహు జటిలమయిన శాస్త్ర విషయాలను కూడా అతి సులభమయిన శైలిలో తేలికగా అర్థమయ్యేటట్లు చెప్పాడు. కెప్టెన్ వివేకానందమూర్తి కాసేపు మౌనంగా ఉండిపోయాడు తరువాత ఉత్సాహంగా అన్నాడు :

"చాలా సంతోషంగా ఉంది తమ్ముడూ! నీ తెలివి తేటలకి. ఊహాపోహాలకి ఎంతో ఆనందిస్తున్నాను. గర్విస్తున్నాను కూడా. కాని, నువ్వు ఒకటి, రెండు చెడ్డపనులు చేశావు. అందులో ముఖ్యమయినది నేను నీకు అన్నయ్యని అవుతానని నలుగురితోను చెప్పి వాళ్ళను నమ్మించడం, ఇది నిజానికి చాలా తీవ్రమయిన విషయం. ఇట్లా అబద్ధాలు చెప్పడం ఎంత మాత్రం హర్షించ తగిన విషయం కాదు. అబద్ధాలాడే వ్యక్తిని సంఘంలో ఎవ్వరూ నమ్మరు. ఎవ్వరూ అటువంటి వాణ్ణి విశ్వసించి బాధ్యతకల పనులు అప్పగించరు. అబద్ధాలకోరుని ఎవ్వరూ గౌరవించరు సరికదా, దగ్గరికయినా చేరనీయరు నేను చెప్పేది జాగ్రత్తగా వింటున్నావా ?"

విజయ సారథి మాట్లాడకుండా వింటున్నానన్నట్లు తల త్రిప్పాడు.

"ఉదాహరణకి నీ విషయమే తీసుకుందాం. నేను నీకు అన్నయ్యని అవుతానని అందరితోను అబద్ధం చెప్పినందుకు నీకు కలిగిన ప్రయోజనం ఏమయినా ఉందా ? ఏమీ లేదు. పైగా, లేనిపోని బాధ్యతలు, భారాలు కొన్ని నెత్తిన పడ్డాయి.

కొన్ని కొత్త బాధలుకూడా కలిగాయి. నేను చెపుతున్నది నిజమేనంటావా ?"

"నిజమేనండి." విజయ సారథి తల వంచుకునే జవాబు చెప్పాడు.

"నువ్వు చేసిన మరో చెడ్డపని ఏమిటో తెలుసా ? అవసరసమయంలో నీ మిత్రులకి ద్రోహం చేసి దూరంగా పిరికిపందవలె పారిపోవడం. సైనికులమయిన మేము అటువంటి చర్యలను సహించ లేం. అట్లా క్రమశిక్షణకు విరుద్ధంగా నడిచే వారిని ఏం చేస్తారో నీకు తెలుసనుకుంటాను."

"తెలుసండి. నేను ఆ విషయాన్ని పత్రికలో చదివాను."

తరువాత కెప్టెన్ వివేకానందమూర్తి కుర్చీలోంచి లేచి గదిలో కాసేపు అటుఇటు పచార్లు చేశాడు. అతను ఏదో విషయాన్ని గూర్చి తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు కనిపించాడు. పిమ్మట మళ్లీ యథాప్రకారం కుర్చీలో కూచున్నాడు.

"ఇప్పుడేం చేద్దామంటావు తమ్ముడూ ? మన బాంధవ్యం సంగతి ఎవ్వరితోను చెప్పకుండా ఉందామంటావా ? అట్లా అయితే, పాపం, వాళ్ళని మనం మోసం చేసిన వాళ్ళమవుతాము. అందరు మనం అన్నదమ్ములమేనని అనుకుంటారు."

కెప్టెన్ వివేకానందమూర్తి విజయ సారథి దగ్గిరికి వచ్చి వాడి కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు :

"నీ అభిప్రాయం ఏమిటో చెప్పు."

విజయ సారథి మౌనంగా ఉండి పోయాడు.

"ఊహుఁ, అది లాభంలేదు. అట్లా చేయడం కూడా మంచిదికాదు. ఏమంటే వాళ్ళు ఎప్పటికయినా నిజం తెలుసు కోవచ్చు. అప్పుడు ఇంతకంటే పెద్ద ప్రమాదం ఏర్పడుతుంది. వాళ్ళు నీతోపాటు నన్ను కూడా అబద్ధాలకోరుగా జమకడ తారు. అటువంటిది నేను అసలు భరించలేను."

కాసేపు నిశ్శబ్దం.

"అవును అట్లా చేయడమే మంచిది. అసలు సంగతి ఏమిటో అందరికి చెప్పేద్దాం. అందువల్ల నీకు వచ్చే నష్టం కూడా ఏమీ లేదు. నిన్ను బడిలో ఎవరూ ఏడిపించకుండా చూసే బాధ్యత నాది. ఏమంటావు? ఈ సమస్యను నా అంతట నేనే పరిష్కరిస్తాను."

హఠాత్తుగా కెప్టెన్ వివేకానందమూర్తి ముఖ కవళి కలు మారిపోయాయి. అతను గంభీరమూర్తి అయినాడు. విజయ సారథి కళ్లలోకి తీక్షణంగా చూస్తూ అన్నాడు:

"ఇదిగో సారథీ! నేను చెప్పేది శ్రద్ధగా విను. నన్ను నీ అన్నయ్యగా ఎన్నుకున్నావు. అంతవరకు బాగానే ఉంది. కాని, అంతటితో నీ బాధ్యత తీరిపోలేదు. నువ్వు అన్ని విష యాల్లోను, అంటే చదువులో, క్రమశిక్షణలో, ఆట పాటలలో అందరికంటే ముందు ఉండాలి. నా గౌరవాన్ని, అంతకు మించిన మన ఇంటి పేరుని నిలబెట్టాలి. నీకు ఈ మధ్య చదు వులో శ్రద్ధ తప్పినట్లు మీ హెడ్మాస్టారి ఉత్తరం వల్లనే తెలు స్తున్నది కదా! పోతే, రాత్రి నువ్వు నిద్రపోయిన తర్వాత ఏమీ తోచక నీ లెక్కల పుస్తకం చూశాను. అందులో లెక్కలన్నీ చాలా తేలికగా ఉన్నాయి. నేను నీ వయస్సు

ఉండగా లెక్కలు బాగా చేసేవాణ్ని. నిజానికి అన్నిటికంటె లెక్కలంటేనే నాకు ఎంతో ఇష్టం. దానికి తోడు. మా లెక్కల మాస్టారు కూడా చాలా సమర్థులు. అంతేకాదు, బహు కోపిష్టి కూడా! పొరపాటున ఏ చిన్న తప్పు చేసినా నా వేళ్లు విరిగేట్లుగా రూళ్ళకర్రతో కొట్టేవారు."

మా పుస్తకంలో లెక్కలన్నీ తేలికయినవనుకుంటున్నారా ?" విజయ సారథి ధైర్యంగా అన్నాడు. పదో అభ్యాసంలోని చివరి లెక్క చాలా కష్టమయినది. దాన్ని మా తరగతిలో ఒక్కడు కూడా చేయలేకపోయాడు.

"ఏదీ, ఆ లెక్క సంగతి ఓ సారి చూద్దాం" అంటూ వివేకానందమూర్తి గబ గబా పేజీలు తిరగవేసి పదో అభ్యాసంలోని చివరి లెక్కను పరిశీలించసాగాడు. "ఈ లెక్క సంగతే కదూ నువ్వు చెప్పింది? ఇదికూడా పెద్ద కష్టమయిన లెక్కేనా? ఓ క్షణం ఓపికపట్టు. దీని వ్యవహారం తేలుస్తాను.

బయట అదే పనిగా కారు హారను మ్రోగసాగింది.

"సర్వోలేదు. కాసేపు ఉంటాడులే!" వివేకానంద మూర్తి నోటు పుస్తకంలో ఏవో అంకెలు వేస్తూ అన్నాడు. "లెక్కని ఎప్పుడూ బాగా అర్థం చేసుకోనిదే చేయకూడదు."

ఇంతలో గణ గణమంటూ టెలిఫోన్ మ్రోగింది.

"రామరామ. ఈ రణ గొణ ధ్వనిలో లెక్క చేయడం ఎట్లాగో అర్థంకావడంలేదు. ఇంట్లో ఈగోల, బయట ఆగోల" అంటూ టేలిఫోన్ మీద ఓ దిండు పెట్టాడు.

"ఊఁ, ఎంతవరకు వచ్చాం? ఇప్పుడు మనం ఓ చిన్న భాగహారం చేయవలసివుంటుంది." కెప్టెన్ వివేకానందమూర్తి అట్లా ఓ అయిదు నిమిషాలసేపు శ్రమించిన మీదట సంతోషంగా అన్నాడు. "ఊఁ, లెక్క పూర్తయింది. పెద్దకష్టమయిన లెక్క అన్నావుకదూ? ఎంతలో చేశానో చూడు. ఇక నువ్వు ఆన్సరు చూడటమే తరువాయి."

విజయసారథి ఆన్సరుచూచి అన్నాడు; "మీకు వచ్చిన ఆన్సరుకి, పుస్తకంలో ఉన్నదానికి ఎక్కడా సంబధం లేదు. పుస్తకంలో రు 280 లు అని ఉంది. మీకేమో రు. 175 లు అని ఆన్సరు వచ్చింది."

"ఏమిటి నిజంగానా?" వివేకానందమూర్తి ఆశ్చర్యంగా అన్నాడు. తరువాత అతను ఆన్సరు చూశాడు." అవును. నువ్వు చెప్పింది నిజమే! కాని, నేను చేసిన లెక్క తప్పు కావడానికి అవకాశం లేదు. ఏమంటే, అన్ని అంకెలు సక్రమంగానే ఉన్నాయి. బహుశః పుస్తకంలోని ఆన్సరు తప్పు కావచ్చు."

"పుస్తకంలోని ఆన్సరు తప్పుకాదు. మొన్న మా మాస్టారు చేస్తే పుస్తకంలో మాదిరిగానే ఆన్సరు వచ్చింది. కాని, మాస్టారు లెక్క ఎట్లాచేశారో నాకు జ్ఞాపకం లేదు."

కెప్టెన్ వివేకానందమూర్తి మళ్ళీ లెక్కను మొదటి నుంచి జాగ్రత్తగా సరిచూడటం ప్రారంభించాడు. బయట కారు హారన్ విసుగు, విరామం లేకుండా మ్రోగుతూనే ఉంది. దిండుక్రింద ఉన్న టెలిఫోన్ విడవకుండా గణగణ గొణుగుతూనే ఉన్నది.

"అయితే, నేను ఎక్కడో తప్పు చేసివుంటాను." వివేకానందమూర్తి అన్నాడు." ఈసారి మనం ఇద్దరంకలిసి జాగ్రత్తగా చేద్దాం ఉండు."

ఇంతలో ఎవరో బయట తలుపు కొట్టారు. మొదట మెల్లగా, భయం భయంగా కొట్టారు కాని, తరువాత గట్టిగా, జోరుగా కొట్టసాగారు. గది బయటినుంచి వినవచ్చే గుస గుసలను విజయసారథి అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

"నువ్వే ముందు వెళ్ళు." ఇది రాధాయి కంఠమని విజయసారథి వెంటనే పసిగట్టాడు.

"నేనేం వెళ్ళను. ముందు మాధవరావు వెళ్ళాలి." ఇది శంకరం కంఠం.

విజయసారథి కెప్టెన్ వివేకానందమూర్తి కేసి ఆందోళనగాచూస్తూ ఆత్రంగా అన్నాడు.

"వాళ్లు ... బయట గుస గుసలాడుతున్న వాళ్ళు... మా తరగతి వాళ్లే ! సందేహం లేదు."

కెప్టెన్ వివేకానందమూర్తి మెల్లగా తల ఎత్తాడు.

"బహుశః నిన్ను చూడటానికి వచ్చి ఉంటారు— అవునా ? అయితే, ఇందాక మనం అనుకొన్నట్లు మన బాంధవ్యం సంగతి నువ్వు చెపుతావా లేక నన్ను చెప్ప మంటావా ?"

"మీరే చెప్పండి." విజయ సారథి తలవంచుకుని అన్నాడు. "నేను వాళ్ళకి తరువాత చెప్తాను. ఇప్పుడు చెప్పను."

"నీ ఇష్టం."

"నేను ప్రక్క గదిలోకి వెడతానండి. అవసరం వచ్చినప్పుడు వస్తాను." అంటూ విజయ సారథి గబగబా ప్రక్క గదిలోకి వెళ్ళాడు.

"అందరు లోపలికి రండి" కెప్టెన్ వివేకానందమూర్తి ఆహ్వానించాడు.

గది తలుపులు త్రోసుకుని నెమ్మదిగా ఒకొక్కట బిక్కు బిక్కుమంటూ లోపలికి వచ్చారు. మొట్ట మొదటి మాధవరావు వచ్చాడు. వాడి తరువాత రాధాయి, వాడి వెనుక శంకరం లోపల అడుగు పెట్టారు. వాళ్ళ తరువాత అయిదవ ఫారం 'బి' సెక్షన్‌కి చెందిన మరి నలుగురు పిల్లలు కూడా వచ్చారు. వాళ్ళు అందరు గదిలోకి వచ్చి, కెప్టెన్ వివేకానందమూర్తిని చూడగానే బిడియ పడుతున్నట్లు తల వంచుకుని ఒకడి వెనుక ఒకడు నిలబడ్డాడు.

"అట్లా నిలుచున్నారేం అబ్బాయిలూ! రండి, ఆ కుర్చీలలో కూచోండి." వివేకానందమూర్తి ఆప్యాయంగా అన్నాడు.

అందరు కుర్చీలు ఎక్కడ అరిగిపోతాయో అన్నట్లు మెల్లగా ఓ మూలకి ఒదిగి కూచున్నారు.

"మీ తమ్ముడు విజయసారథి కులాసాగా ఉన్నాడా?" మాధవరావు, కెప్టెన్ వివేకానందమూర్తి కేసి బెదురు చూపులు చూస్తూ అన్నాడు.

అతను ఓ క్షణం సేపు ఏమీ మాట్లాడ లేదు.

"మీకు ఒక్క ముఖ్యమయిన సంగతి చెప్పదలచు కున్నాను. బహుశః నేను చెప్పబోయే సంగతిని మీరు వెంటనే నమ్మలేక పోవచ్చు. కాని, నేను చెప్పబోయే సంగతి మాత్రం నిజం."

కెప్టెన్ వివేకానందమూర్తి ధోరణి ఆ పిల్లవాళ్ళకి అర్థం కాలేదు. వాళ్ళ తమ్ముడు కులాసాగా ఉన్నాడో, లేదో చెప్పడానికి బదులు ఏదో ముఖ్యమయిన సంగతి అంటూ మరొక విషయం మొదలు పెట్టాడేమిటని వాళ్ళు ఆలోచించసాగారు. కాని, ఎంత ఆలోచించినా ఆ ముఖ్యమయిన విషయమేమిటో ఎవ్వరికీ అంతు పట్టలేదు. ఆశ్చర్యంగా ఒకరి ముఖాన్ని మరొకరు చూసుకున్నారు.

"ఊఁ, ఇక ఆ సంగతి చెప్పేస్తాను. మీరు అందరు విజయ సారథి నా తమ్ముడను కుంటున్నారు కదూ?"

అందరు అవునన్నట్లు చూశారు.

"కాని, అది నిజంకాదు. విజయసారథి నా తమ్ముడు కాదు."

పిల్లలందరు ఒక్కసారి ఆశ్చర్యంగా కెప్టెన్ వివేకానంద మూర్తికేసి చూశారు. వాళ్లు ఆ విషయాన్ని నమ్మినట్లు కని పించలేదు. అసలు సంగతి అంతకుముందే తెలిసిన రాధాయి మాత్రం కిటికీలోంచి బయటికి చూస్తూ నిశ్చలంగా కూచు న్నాడు.

"నేను చెప్పిన సంగతి మీరు నమ్మనట్లు మీ ముఖాలే చెపుతున్నాయి. కాని, నామాట నిజమని మరొకమారు గట్టిగా చెపుతున్నాను.

పిల్లలందరికి ఏమీ తోచలేదు. కెప్టెన్ వివేకానంద మూర్తి మాట నమ్మ శక్యంగాకుండాఉంది. అయినా, అతను గట్టిగా చెపుతుంటే నమ్మకుండా వుండటం ఎట్లా? అంత పెద్ద మనిషికి, ప్రసిద్ధ వ్యక్తికి అబద్ధం ఆడే కర్మ ఏమొచ్చిందని?

"నిజంగానా అండీ?" శంకరం అతి కష్టం మీద అనకలిగాడు. "మరి విజయసారథి మీరు తనకి అన్నయ్య అవుతారని చెప్పాడే?"

"ఊరికే తమాషాకి, మిమ్మల్ని ఆటలు పట్టించడానికి అట్లా చెప్పివుంటాడు. అంతే!"

"మా అందరికి ఒక్కసారి కాదండి, చాలాసార్లు చెప్పాడు. తమాషాకి అయితే అట్లా ఎందుకు చెపుతాడు." మాధవరావు అన్నాడు.

"ఆ సంగతి మీరే స్వయంగా విజయసారథిని కనుక్కోండి." అంటూ కెప్టెన్ వివేకానందమూర్తి విజయసారథిని పిలిచాడు.

కాని, విజయసారథి బయటికి రాలేదు.

"రావోయి తమ్ముడు, రా! ఇక్కడ కూచున్న వాళ్ళందరు నీ మిత్రులే! పరాయివాళ్ళు ఎవ్వరూ లేరు."

ఆ విధంగా ఓ అయిదు నిమిషాలు బతిమిలాడించుకున్న మీదట కాని విజయ సారథి గదిలోంచి బయటికి రాలేదు. వాడు నీరసంగా కాళ్ళీడ్చుకుంటూ వచ్చి ఓ కుర్చీలో తలవంచుకుని కూచున్నాడు.

"మీ అన్నయ్య ... అహాఁ కాదు... కెప్టెన్ వివేకానందమూర్తిగారు చెప్పిన సంగతి నిజమేనా సారథీ?" శంకరం ప్రశ్నించాడు.

"నిజమే !"

విజయ సారథి తన మిత్రులముందు తన తప్పు ఒప్పుకున్నాడు. తన పొరపాటుకు, మోసానికి మన్నించమని మరీ మరీ అర్థించాడు.

"ఊఁ, అయితే మమ్మల్ని అందరిని మోసం చేశావన్న మాట." మాధవరావు నిష్ఠూరంగా అన్నాడు. "మేము నీ కబుర్లు అన్నీ నిజమేనని నమ్మాం."

"నువ్వు ఇంత పెద్ద అబద్ధాల కోరువని నేను ఎన్నడూ ఆఖరికి కలలో కూడా అనుకోలేదు. ఎంతమోసం, ? ఎంత నాటకం ?" శంకరం అన్నాడు.

"ఇట్లా అబద్ధాలు చెపితే ఇక మన బడిలో నిన్ను ఎవరయినా నమ్ముతారా ? ఓ వేళ నువ్వు నిజం చెప్పినా అబద్ధమని త్రోసి పారేస్తారు." ఆ వచ్చిన వాళ్ళలో ఒకడు అన్నాడు.

"ఇక మీ నిష్ఠూరాలు, కోపతాపాలు కాసేపు కట్టిపెట్టండి అబ్బాయిలూ ... అని కెప్టెన్ వివేకానందమూర్తి చెపుతుంటే అతని మాటలకు అడ్డువస్తూ విజయ సారథి అన్నాడు :

"ఊఁ, ఆపేశారేం ? మీరు అనదలచుకున్న వన్నీ అనండి. మీతో అబద్ధాలు చెప్పినందుకు నన్ను ఎన్ని మాటలయినా అనండి. నాకు విచారం లేదు." ఆ మాటలు

అంటుంటే విజయ సారథి గొంతు బొంగురు పోయింది. కళ్లనిండా నీళ్ళు నిలిచాయి.

విజయ సారథి మౌనంగా, విచారంగా తలవంచుకుని కూచుండిపోయాడు. పిల్లలందరు నిశ్శబ్దంగా, ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు దిగాలుపడి కూచున్నారు. వాళ్ళకి విజయ సారథి కేసి చూడటానికి కూడా ధైర్యం చాల కుండాఉంది."

విజయ సారథి అందరికి ఆ విధంగా ఎందుకు అబద్ధం చెప్పవలసి వచ్చిందో కెప్టెన్ వివేకానందమూర్తి పిల్లలందరికి వివరంగా చెప్పాడు.

"నా ఉద్దేశ్యంలో విజయ సారథి చాలా మంచివాడు. ఎంతో తెలివితేటలు, శక్తియుక్తులు కలవాడు. అతను ఎన్నో కలలు, మధురాతి మధురమయిన కలలు, కనేవాడు. అట్లా కలలు కనడంలో ఎంత మాత్రం తప్పు లేదు. అసలు కలలు కనని వ్యక్తి అంటూ ఈ ప్రపంచంలోనే లేడేమో! కాని, విజయ సారథి ఈ సందర్భంలో ఓ పొరపాటు చేశాడు. తన కలలను తనలోనే దాచిపెట్టుకో లేదు. వాటిని బహిర్గతం చేశాడు. నలుగురికీ చెప్పాడు. వాళ్లని నమ్మించాడు. అక్కడే వచ్చింది చిక్కంతా!"

పిల్లలందరు అతనుచేప్పేమాటలను శ్రద్ధగావినసాగారు.

"మీరందరు ఎన్నో కలలు కంటారు, అవును కదూ? ఉదాహరణకి రాధాయి విషయమే తీసుకుందాం. అతను ఏ పెద్ద డాక్టరో కావాలని కలలు కంటూ ఉండవచ్చు..."

"నేను డాక్టరుని కావాలని ఎప్పుడూ కలలు కననండీ!" రాధాయి తల అడ్డంగా త్రిప్పుతూ అన్నాడు "నేను ఓ పెద్ద రచయితని కావాలని కలలు కంటుంటాను."

"అవునవును. మరి నువ్వు రచయితవి కాకపోతే నీ రచనలు చదివే భాగ్యం మా కెట్లా కలుగుతుంది?" కెప్టెన్ వివేకానందమూర్తి నవ్వుతూ అన్నాడు. పిల్లలందరు మెల్లగా నవ్వారు. అంత వరకు విచారంగా ఉన్న ఆ గదిలోని వాతావరణం క్షణంలో ఆనందమయమయింది. ముసి ముసి నవ్వులలో మునిగిపోయింది.

"నేను ఓ మంచి ఇంజనీర్ని అవుదామని కలలు కంటున్నానండి." శంకరం సిగ్గు పడుతూ అన్నాడు,

"మంచిది. ఆ కనే కలలేమిటో రాత్రి పూటనే కను. లేకపోతే చాలా ప్రమాదం వస్తుంది. తెలుసా? నువ్వు ఇంజనీర్వి కాకపోతే మన విశాలాంధ్రలోని ప్రాజెక్టులన్నీ ఏం కాను? ఒక్కసారిగా మూలబడి ఊరుకుంటాయి." వివేకానందమూర్తి పరిహాసంగా అన్నాడు.

"ఇంతకీ మన సారథి ఏం కావాలని కలలు కంటున్నాడో చెప్పనే లేదు..." మాధవరావు అన్నాడు.

విజయ సారథి తలఎత్తి ఓ సారి అందరికేసి సగర్వంగా చూశాడు. తరువాత మెల్లగా అన్నాడు:

"నా కల ఏమిటో మీకు తెలిసే ఉంటుంది. నేను కెప్టెన్ వివేకానందమూర్తి గారికి తమ్ముణ్ణి కావాలని కలలు కంటున్నాను."

"ఒప్పుకున్నాం. నీ కోరిక, కాదు కాదు, కల అంగీక రించబడింది. ఇవాళ నుంచి, నీకు అంతకీ తృప్తి లేకపోతే, నువ్వు నా తమ్ముడు అవుదామని కలలు కనడం ప్రారంభించిన రోజునుంచి, నిన్ను నా చిన్న తమ్ముడుగా స్వీకరిస్తున్నాను. సరేనా ?"

విజయ సారథి ఏమీ మాట్లాడలేదు. తన మనసులో మాత్రం "నా వివేకానందమూర్తి అన్నయ్య ... నా అన్నయ్య..." అని ఎన్నోసార్లు అనుకున్నాడు.

విజయ సారథి ఒంట్లో ఎట్లా ఉందో తెలుసుకోడానికిగాను రాజారావు మాస్టారు రహదారి బంగళాకి వచ్చారు. ఆయన వచ్చేసరికి కెప్టెన్ వివేకానందమూర్తి మకాం చేస్తున్న గది బయట రెండు కాళ్లు నిలిచి ఉన్నాయి. రాజారావు మాస్టారు గబ గబా లోపలికి వెళ్ళబోయారు. కాని, గది బయట ఉన్న జవాను ఆయన్ను ఆపి, కెప్టెన్ వివేకానంద మూర్తి గారు లోపల ఏదో తీవ్రమయిన విషయాన్ని పరిష్కరించడంలో నిమగ్నులై ఉన్నారనీ, లోపలికి ఎవ్వరినీ రానీయ వద్దని ఆజ్ఞాపించారని చెప్పాడు. రాజారావు మాస్టారు ఆ మాటలనేమీ లెక్క చేయకుండా హడావిడిగా లోపలికి ప్రవేశించారు.

గది బయట నిలిచిఉన్న రెండు కాళ్లు అదేపనిగా గోల చేస్తున్నాయి. దిండు క్రింద చేరిన టెలిఫోన్ ఒక టే మయిన గణ గణ మంటూ గొణుగుతున్నది. కుర్చీలన్నీ ఒక వరుసగా లేక అష్ట వంకరలు తిరిగి ఉన్నాయి. విమాన వీరుడయిన కెప్టెన్ వివేకానందమూర్తి ఓ గుండ్రని బల్లముందు

కూచుని ఏదో చక చకా వ్రాస్తున్నాడు. అతని చుట్టూ విజయ సారథి, శంకరం, రాధాయి వగైరాలు చేరి ఏదో విషయాన్ని గూర్చి తీవ్రంగా చర్చిస్తున్నారు.

"ఊఁహుఁ, మనం సరిగా చేయలేదు. ఎక్కడో పొర పడ్డాం." కెప్టెన్ వివేకానందమూర్తి పిడికిలి బిగించి బల్లమీద గుద్దుతూ బిగ్గరగా అన్నాడు. "లేకపోతే సరిఅయిన ఆన్సరు ఎందుకురాదు? సరే, దీన్ని ఇంతటితో వదిలి పెట్టకూడదు. మళ్ళీ లెక్కని మొదటినుంచి చేద్దాం వుండండి."

రాజారావుమాష్టారికి ఆ లెక్కసంగతి, విజయసారథికి, కెప్టెన్ వివేకానందమూర్తికికల బాంధవ్యం సంగతి తెలుసు కోడానికి అరగంట తరువాత కాని వీలు కలగలేదు.

♦ ♦ ♦

మళ్ళీ ఓసారి హైస్కూలుకి వెళ్ళి పిల్లలందరికి, ముఖ్యంగా అయిదవ ఫారం 'బి' సెక్షన్ పిల్లలకి విజయ సారథికి తనకి గల బాంధవ్యాన్ని గూర్చి స్పష్టంగా చెప్పి వెయ్యాలని కెప్టెన్ వివేకానందమూర్తి తలంచాడు. కాని, ఊపిరి సలపని కార్యక్రమం వల్ల అట్లా చేయడానికి వీలులేక పోవడంతో అతను అయిదవ ఫారం 'బి' సెక్షన్ పిల్లలపేర ఓ ఉత్తరం వ్రాశాడు.

ఆ ఉత్తరం మొట్టమొదట అయిదవ ఫారం 'బి' సెక్షన్ పిల్లలకి చదివి వినిపించ బడింది. తరువాత దానిని అందరు చదువుకునే నిమిత్తం నోటీసు బోర్డులో అంటించారు. ఆ ఉత్తరం ఇది.

"విద్యార్థి మిత్రులకి ఆశీర్వచనాలు.

"ఈ ఉత్తరంలో మీకు కొన్ని యదార్థ విషయాలను తెలియజేయడానికి ఉత్సాహ పడుతున్నాను. మీరందరు ఇంతవరకు అనుకుంటున్నట్లు చిరంజీవి విజయసారథి నా స్వంత తమ్ముడు కాదు. అతనికి, నాకు వున్న సంబంధమల్లా ఒక్క ఇంటి పేరులోనే! కాని, అతను మీరందరితోను నేను తనకి అన్నయ్యని అవుతానని అబద్ధం చెప్పి మిమ్మల్ని నమ్మించాడు. అది ఎంతమాత్రం నిజంకాదు. అబద్ధం చెప్పినందువల్ల ఎట్టి విష పరిణామాలు కలుగుతాయో అతను ఇప్పటికయినా గ్రహించాడని, భవిష్యత్తులో ఎల్లప్పుడు నిజమే చెప్పగలడని హృదయ పూర్వకంగా విశ్వసిస్తున్నాను.

"మనం ఒకవ్యక్తిని అతని చేతలను బట్టి గౌరవిస్తాం కాని, అతనికి ఇతరులతో కల బాంధవ్యాన్ని బట్టికాదు. ఒక మహాపురుషునికి బంధువయినంత మాత్రాన మనం ఓవ్యక్తిని గౌరవించగలమా? వారివారి వ్యక్తిత్వాలను బట్టి, శక్తి సామర్థ్యాలను బట్టి మాత్రమే మనం గౌరవిస్తాం. ఇదంతా ఎందుకు చెప్పానంటే, విజయసారథికి నేను అన్నయ్యని అయినంతమాత్రాన అతనికి లాభించినది ఏమీలేదు. కానంత మాత్రాన లాభించనదీ ఏమీలేదు. అతని తెలివితేటలు, శక్తియుక్తులే అతనికి గౌరవాన్ని తెచ్చిపెట్టగలవు.

అయితే ఒక్కసంగతి; విజయసారథిని నేను జాగ్రత్తగా పరిశీలించి చూశాను. అతను నాకు నచ్చాడు. అందువల్లనే నేను అతన్ని నాతమ్మునిగా స్వీకరింప నిశ్చయించాను. కనుక, మీరు అతన్ని అబద్ధం ఆడినందుకు ఏడిపించరని ఆశిస్తు

న్నాను. అతని మనసు కష్టం కలిగించే మాటలేవీ అనవద్దని మరీ మరీ కోరుతున్నాను.

"చివరికి ఓ మాట! మీరందరు శ్రద్ధగా చదివి, వృద్ధిలోకి వచ్చి, దేశానికి సేవ చేస్తారని హృదయ పూర్వకంగా విశ్వసిస్తున్నాను.

ఆరోజునే విజయసారథి హెడ్మాస్టారికొక కవరు అందచేశాడు. దాంట్లో ఇట్లాఉంది.

"గా॥ హెడ్మాస్టరుగారికి,

నమస్కారములు. మీరు దయతో వ్రాసిన జాబు చేరింది. 'నా తమ్ముడు' విజయసారథి ఇకనుంచి బాగా చదవగలడని, క్రమశిక్షణకి లోబడి ఉండగలడని హామీ ఇస్తున్నాను.

భవదీయ,

కూనపులి వివేకానందమూర్తి."

శ్రీ శారదా ప్రెస్, ప్రకాశం రోడ్డు, విజయవాడ-2

VIMANA VEERUDU　　A KAVITA PUBLICATION
MATTEGUNTA RADHA KRISHNA　　RE. 1-50 NP



శ్రీ మట్టెగుంట రాధాకృష్ణ కవిగా, కథకులుగా ఆంధ్రదేశానికి సుపరిచితులు.

1935 వ సంవత్సరంలో గుంటూరు జిల్లాలోని తెనాలిలో వెంకాయమ్మ - సీతారామాంజనేయులు గార్లకు జన్మించారు. బాపట్ల హైస్కూల్‌లోను, బందరు హిందూకాలేజి, భీమవరం డబ్లియు. జి. బి. కాలేజిలోను విద్యాభ్యాసం చేసి - ఆంధ్రా యూనివర్సిటీనుంచి అర్థిక శాస్త్రంలో బి. ఏ., డిగ్రీ పొందారు.

పదహారవ ఏటనుంచి గేయాలు, కథలు వ్రాయడం ప్రారంభించారు. బందరు తెలుగు సాహితీ సమితి స్థాపకులలో ముఖ్యులు. భీమవరం కాలేజి ఆంధ్రభాషా పరిషత్ అధ్యక్షులుగా 1955-'56 సంవత్సరంలో పనిచేశారు. విద్యార్థిగా ఉంటూ "బడిపిల్లలు" అనే నవల వ్రాసినందుకు వీరిని కాలేజి వారు సన్మానించారు.

వీరి మొదటి నవల "బడిపిల్లలు" 1955 వ సం॥లో ప్రచురింపబడి ఆరునెలల్లోనే పునర్ముద్రణ పొందేటంత బహుళప్రచారాన్ని పొందింది. "విమానవీరుడు" వీరి రెండవ నవల. త్వరలోనే వీరి మూడవ నవల "దీక్ష"ను ప్రచురించబోవుచున్నాము.

శరత్, ప్రేమ్‌చంద్, బాపిరాజు .... కానన్‌డాయిల్, ఓ హెన్రీ, పి. జి. ఉడవుస్ ప్రభృతుల రచనలంటే వీరికి ఎక్కువ ఇష్టం. చదరంగం ఆడటం, క్రొత్త పరిచయాలు ఏర్పరచుకోవడం మొదలగునవి వీరి అభిలాషలలో ముఖ్యమైనవి.

ప్రస్తుతం బెంగుళూరునుంచి వెలువడుతున్న "ప్రజామత" వార పత్రికలో సహాయసంపాదకులుగా ఉంటున్నారు.

— సంపాదకులు.

PRINTED AT SRI CARADA PRESS, VIJAYAWADA-2.